# అమెరికా
# సంయుక్త రాష్ట్రాలలో
# విద్యావిధానం

అనువాదం:

ప్రయాగ కోదండరామశాస్త్రి



హంసప్రచురణలు, విజయవాడ - 2

# ముమ్నుడి

అమెరికా సంయుక్తరాష్ట్ర ప్రభుత్వం ప్రతి సంవత్సరం వందలకొలది విదేశీయులకు స్వాగతం ఇస్తున్నది. వీరిలో భవిష్యదభ్యుదయ సాధనకోసం అమెరికన్ అధ్యాపకులతో పాటు అధ్యయనతరగతులలో పాల్గొనేందుకు వచ్చే ఉపాధ్యాయులూ మా కళాశాలా విశ్వవిద్యాలయాల్లో ప్రజాస్వామికాన్ని పరిశీలింపగోరే మహా మేధావులూ, అతి సాధారణులూ వుంటారు. వారి వారి విశిష్ట పరిశీలనా రంగాలు ఏమైనప్పటికీ అందరూ మా విద్యాలయాలపట్ల ఆసక్తికలవారే.

మా దేశానికి విచ్చేసి మా పాఠశాలలను సందర్శించి ఉపాధ్యాయులతోనూ, తలిదండ్రులతోనూ, బిడ్డలతోనూ ముచ్చటించేటప్పుడు వారికి కనిపించేదీ, వినిపించేదీ ఏమిటో అర్థంచేసుకొనేందుకు అవసరమైన అంశాలనూ, మా విద్యావిధానాన్ని గూర్చిన సాధారణ సమీక్షనూ, సందర్శకులకు అందజేయటమే ఈ పుస్తకం యొక్క లక్ష్యం. వారు తిరిగి తమ తమ దేశాలకు వెళ్ళిన పిమ్మటకూడా వారి సందేహాలకు సమాధానంకోసం ఇది వారికి ఆధారభూతం కాగలదని ఆశిస్తున్నాము.

ఎరల్ జేమ్సుమాక్ గ్రాత్

[సంయుక్త రాష్ట్ర విద్యాధికారి]



దేవాయాలయాలను మించిన విద్యాలయాలు

# 1 అమెరికా పాఠశాలా విధానము

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో జాతీయ వికాసానికి విద్య ప్రధానపాత్ర వహిస్తున్నది. అమెరికా వలసదేశంగా ఉన్న రోజుల్లో విద్యాసౌకర్యాలు బహు తక్కువ. ఆ తొలినాళ్ళలో వైయక్తిక పాఠశాలలో కావలసినంత డబ్బు చెల్లించుకోగల ధనవంతుల బిడ్డలకు మాత్రమే విద్య అందుబాటులో వుండేది. ఒక్కొక్కప్పుడు పేదవారి పిల్లలకు కూడా వైయక్తిక పాఠశాలలలోనూ, మత రాజకీయ పాఠశాలలలోనూ ప్రాథమిక విద్యాసౌకర్యా లుండేవి. ఆ వలస కాలంలో పాఠశాలలు చాలా భాగం వ్యక్తిగత వ్యాపారంగా పెంపొందింప బడినవి. ఏమైనా, అవి కేవలం వైయక్తికాలని గానీ, సాముదాయకాలని గానీ చెప్పజాలము.

వైయక్తిక పాఠశాలో పాధ్యాయులు కూడా తమ పాఠశాలల్లో అందరికీ ప్రవేశం కల్పించి, అందరి ఆదరాభిమానాలనూ ఆర్జించేవారు.

తమ వలస ప్రభుత్వాలక్రింద అమెరికా ప్రజలు పెంపొందించుకొన్న ప్రధాన విద్యాసంస్థ 'ప్రైవేట్ అకాడమీ'. అది రెండు వందలేండ్లకు పైబడి, ఇంతవరకూ ఆ రకం సంస్థల్లో ప్రముఖమైనదిగా ఉన్నది. వలస ప్రభుత్వాలక్రింద, ఏవో కొన్ని సందర్భాలలో తప్ప, ఉన్నత విద్యాలయాలు కళాశాలలు స్వతంత్ర సంస్థలుగా పనిచేసేటట్లు చేయటం, లేదా వాటికి ధర్మకర్తలను నియమించి, ఆ యా సంస్థలకు అవసరమైన విరాళాలను వసూలు చేయటానికీ, ప్రభుత్వ సహాయం పొందటానికీ వారికి అధికారం ఇవ్వటం ప్రభుత్వ విధానంగా ఉన్నది. ఆ తొలిరోజుల్లో విద్యావిషయంలో ప్రభుత్వ జోక్యం చాలా పరిమితంగా వుండేది. ముఖ్యంగా ఉన్నత పాఠశాలలకు కళాశాలలకు భూములూ వగైరా ఇచ్చేది కేంద్ర ప్రభుత్వం. అయితే ఆ యా సంస్థలను పర్యవేక్షించటానికి గానీ, తమ అదుపులో పెట్టుకొనడానికిగానీ, ప్రభుత్వానికి హక్కు లేదు; ఉన్నా మిక్కిలి తక్కువ. ఈనాడు సంయుక్త రాష్ట్రాలలో భాగంగా వున్న ఏ వలస రాజ్యంగానీ దేశవ్యాప్తమైన ఉచిత విద్యావిధానాన్ని నెలకొల్పటంగానీ, కొనసాగించటంగానీ ఆనాడు జరగలేదు.

మా జాతీయ స్వాతంత్ర్యపు తొలిరోజులనాటి ప్రాథమిక సూత్రాలే ఈనాటి ప్రభుత్వ విద్యావిధానానికి పునాదులు. ఆ తొలి సూత్రాలు చూస్తే క్రిందనుంచి పైదాకా తరగతుల వారీగా విద్యావిధానం ప్రభుత్వాధీనంలో ఉండవలెనని ఆ సూత్ర నిర్మాతలు తలచినట్లు తోస్తుంది. ఇదే భావం ఇండియానా రాష్ట్ర రాజ్యాంగ ప్రణాళికలో 1816 లో ఇట్లు వ్యక్తీకృతమైంది : "తరగతుల వారీగా మాండలిక పాఠశాల నుండి రాష్ట్రీయ విశ్వవిద్యాలయం దాకా సార్వజనీనమైన ఉచిత విద్యావిధానం" ఆ రాజ్యాంగంలో పేర్కొనబడింది. కొద్ది మార్పులతో ఇదే సూత్రం, విద్యా



అమెరికా దేశ ఆధునిక విద్యాప్రదాత

వేత్తలూ ఉపాధ్యాయులూ తయారుచేసిన విద్యా ప్రణాళికలయందే గాక, అనేక రాష్ట్రాల శాసనసభలు నిర్మించిన చట్టాలలో కూడా వ్యక్తీకృతమై వుంది.

ఏమైనా సార్వజనీనమైన ఉన్నత విద్యమాత్రం మందకొడిగానే సాగుతున్నది. డార్టుమౌత్ కాలేజి కేసులో 1819 లో సంయుక్త రాష్ట్రాల సుప్రీంకోర్టు ఒక వైయక్తిక పాఠశాలయొక్క నిబంధనావళిలోని అంశాలను శాసనసభ మార్పు చేయకపోవచ్చునని తీర్పు చెప్పింది. ఆ ముఖ్యమైన తీర్పుకు పూర్వం ఉన్నత విద్యాలయాలన్నీ చాలా భాగం వైయక్తిక

సంస్థలుగానే వుండేవి. దాని తర్వాత అన్ని స్థాయిలలో విద్యావిధానాన్ని ప్రభుత్వాధీనంలో పెట్టుకోవాలనే ప్రయత్నం జరిగింది. మత స్వాతంత్ర్యం మీద నానాటికీ విశ్వాసం వృద్ధికావటంతో ఆ ప్రయత్నం మరీ ఉధృతమైంది. 19 వ శతాబ్ది తొలి పాతికేండ్ల తర్వాత రాజ్య విస్తృతి, పారిశ్రామికాభివృద్ధి విద్యావిషయక విజ్ఞానం పెంపొందాయి. సర్వసాధారణమైన ప్రభుత్వ విద్యావిధానంలో పెంపు ముందుచూపు ఏర్పడిన కాలం అది. 19 వ శతాబ్దిలో స్థానిక ప్రాథమికోన్నత పాఠశాలలనుంచి రాష్ట్రీయ విశ్వవిద్యాలయం దాకా క్రమంగా తరగతుల వారీగా విద్య చెప్పటం అనేది ఒక లక్ష్యంగా మాత్రంగా కాక, అమెరికా ప్రభుత్వ విద్యావిధానంలో ఒక ముఖ్య లక్షణంగా వుంది.

సంయుక్త రాష్ట్రాల విద్యావిధానం ఇప్పుడు స్వతంత్ర రాజ్యాలలో విశ్వాసంమీద ఆధారపడిన ఒక విస్తృత సహకార వ్యవస్థగా రూపొందింది. విద్యావిషయంలో స్వేచ్ఛ, మత విషయంలో స్వేచ్ఛ - ఇవి అమెరికాలో అన్నింటికంటె ప్రధానమైనవి. అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ఒక పిల్లవానికి అతని కుటుంబపు ఆర్థిక సాంఘిక పరిస్థితులతో నిమిత్తం లేకుండా విద్య నేర్చుకొనే హక్కు అనివార్యంగా ఏర్పడింది.

## 2- కేంద్ర - రాష్ట్ర విద్యా సంబంధాలు

అమెరికా స్వాతంత్ర్య సమరం సమాప్తమై 1783 లో పారిస్ సంధిపై సంతకాలు జరిగిన తర్వాత, అంతకుముందు వలస రాష్ట్రాలుగా ఉన్న 13 రాష్ట్రాలూ సర్వస్వతంత్రాలైనాయి. అవే ప్రస్తుత సంయుక్త రాష్ట్రాలు. ఆరేండ్ల తర్వాత రాజ్యాంగాన్ని అనుసరించి కేంద్రప్రభుత్వ మేర్పడినప్పుడు, సంయుక్త రాష్ట్రాలలో ఒకవిధమైన ద్వంద్వ ప్రభుత్వం అమలులోకి వచ్చింది. ఇందు ప్రభుత్వాధికారాలు, రాచకార్యాలు విభజించటం జరిగింది.



డిబేటు చర్చలు: రాజ్యాంగ సభకు మొదటి మెట్టు

---

సంయుక్త రాష్ట్రాల కేంద్రప్రభుత్వ విధానంలో, పెక్కు రాష్ట్రాలలో ముఖ్యంగా విద్య - ఆ యా రాష్ట్రములకే అప్పగించబడింది. కేంద్ర రాజ్యాంగంలోని 10 సవరణ ప్రకారం ప్రతి రాష్ట్రానికీ, తనకు ఉచితమైన విద్యావిధానాన్ని నిర్మించుకొని, తన అదుపులో ఉంచుకొనేందుకు హక్కూ, బాధ్యతా ఈయబడినవి.

కొన్ని సందర్భాలలో మినహా, రాష్ట్రీయ రాజ్యాంగాలు, ఆ యా శాసనసభలను - సమర్థములైన ప్రభుత్వ పాఠశాలలకు తగు సౌకర్యాలు చేయవలసిందిగా - కోరుతున్నాయి. సాధారణంగా రాష్ట్ర శాసనసభలన్నింటికీ విద్యావిషయాలలో పెద్ద అధికారం ఉంది. కీర్తిశేషులైన న్యాయమూర్తి బ్రాండిస్ చెప్పినట్లుగా, ధైర్యంగల ఏ ఒక్క రాష్ట్ర

మైనా, తక్కిన దేశానికి హాని లేకుండా, ఆ ప్రజలకిష్టమైతే, సాంఘి కార్థిక రంగాలలో నూతన ప్రయోగాలు చేసే ప్రయోగశాలలుగా రూపొంద వచ్చు. ఇది కేంద్రవిధానంలోని ఒకానొక ఉన్నత లక్షణం. ఆ యా రాష్ట్రాలు తమకిష్టమైన ప్రయోగాలు చేసుకొనే స్వేచ్ఛ విద్యారంగానికి సైతం వర్తిస్తుంది. ఈ స్వాతంత్ర్యాన్నిబట్టి ఇప్పటి రాష్ట్రీయ ప్రభుత్వ విధానానికి పునాదులు వేయబడ్డాయి. ఆ యా రాష్ట్రాలుచేసే ప్రధానమైన, విస్తృతమైన కార్యక్రమాలలో విద్యావ్యాప్తి మొట్టమొదటిది.

చాలా దేశాలలో విద్యా విషయాలు పరిశీలించటానికి విద్యామంత్రు లుంటారు. ఈ మంత్రిత్వ శాఖలు జాతీయప్రభుత్వంలోని తక్కిన శాఖల్లాగానే పనిచేస్తాయి చాలా దేశాలలో ఈ విద్యాశాఖ పాఠ్య ప్రణాళికా విషయంలోను, పరిపాలనా వ్యవహారాలలోను తగినంత అధికారం చెలాయిస్తుంది.

సంయుక్త రాష్ట్రాలలో కేంద్ర విద్యాశాఖ అంటూ ఒకటి లేదు. ఈ విషయంలో, ప్రపంచంలోని చాలా దేశాలలో అలవాటుగా వస్తున్న దానికంటె, సంయుక్త రాష్ట్రాలలోని విద్యానిర్వహణ ప్రత్యేకమైనది. ఈ 48 రాష్ట్రాలలోను ఒక్కొక్క విద్యాశాఖఉంది. దానిని ఒక్కొక్క రాష్ట్రంలో ఒక్కొక్క పేరుతో వ్యవహరిస్తారు. తక్కిన దేశాలలో విద్యామంత్రిత్వశాఖ చేసే పనిని ఈ ప్రభుత్వశాఖలే నిర్వహిస్తాయి. 1867 లో కేంద్రవిద్యా కార్యాలయం ఏర్పాటు చేయబడింది; అది ఇప్పటి కేంద్రభద్రతా సంస్థల్లో ఒక భాగంగా పనిచేస్తున్నది. చాలా దేశాలలో విద్యామంత్రిత్వ శాఖకు సాధారణంగా ఉండే అధికారం కంటె, విద్యా విషయాలలో ఈ సంస్థకు చాలా తక్కువ అధికారం ఉంది.

## విద్యా విషయాలలో కేంద్రం శ్రద్ధ

విద్యా విషయాలలో కేంద్రప్రభుత్వానికీ రాష్ట్రప్రభుత్వానికీ ఉండే సంబంధాలను గురించి చెప్పిన దాన్నిబట్టి, కేంద్రప్రభుత్వానికి విద్యావిష



భూగోళం — బోధన

యాలలో బొత్తిగా జోక్యం లేదని అనుకోగూడదు. ఆయా రాష్ట్రాల విద్యాసంస్థల నిర్మాణంలోనూ, నిర్వహణలోనూ కేంద్రప్రభుత్వం బాధ్యత వహించక పోయినప్పటికీ, ఆయా సంస్థలకు కావలసిన భూవసతి చూపటంలోనూ, అవసరమైన ధనసహాయం చేసి ప్రోత్సహించటంద్వారానూ,

ఆయా రాష్ట్రాలతో విద్యావ్యాప్తికై, ముఖ్యంగా దోహదం చేస్తున్నది.

సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగచట్టం రూపొందింప బడకముందే జాతీయ కాంగ్రెస్ కాన్ఫెడరేషన్ సూత్రాలక్రింద 1787 ఆర్డినెన్సులో ప్రభుత్వ భూములను దానంచేయడం గురించి ఇలా ప్రకటింప బడింది:

"మంచి ప్రభుత్వానికీ మానవజాతి సౌఖ్యానికీ మతం నీతి జ్ఞానం అవసరం కాబట్టి, పాఠశాలలలో విద్యాపోషణ సర్వదా ప్రోత్సహింప బడాలి."

కేంద్రప్రభుత్వాన్ని ఏర్పరచిన పెద్దలు విద్యకెంత ప్రాముఖ్యం ఇచ్చారో సూచించటానికే ఈ సంగతి ఉల్లేఖితమైనది. ఈ 1787 నాటి కేంద్రచట్టం పై ఖరిలోనే ఆ తర్వాతి అనేక రాష్ట్రాల రాజ్యాంగాలలో ఆయా విద్యావిధానాలు ప్రకటింపబడ్డాయి. దీన్నిబట్టి ఈ ఆర్డినెన్సు పెక్కు రాష్ట్రాల రాజ్యాంగాలలోను, చట్టాలలోను స్వీకృతం కావటంవల్ల దేశవ్యాప్తమైన న్యాయ సూత్రాలలో ఒక భాగంగా స్థిరపడింది. దీనికి రాష్ట్రీయ విద్యావిధానాన్ని రూపొందించటంలో గొప్ప ప్రాముఖ్యంఉంది. రాష్ట్రీయ శాసన సభలలోనూ, ప్రత్యేక న్యాయస్థానాలలోనూ, విద్యా విషయాలలో రాష్ట్రకేంద్ర ప్రభుత్వాల సంబంధాన్ని స్పష్టపరచటానికి పై ఆర్డినెన్సు పదే పదే పేర్కొనబడింది. ఈ ఆర్డినెన్సులో నిర్ధారింపబడిన కేంద్రవిధానం విద్యాసంస్థలకు కేంద్రం కల్పించిన భూవసతుల విషయంలో గొప్ప ప్రభావం కలిగి వున్నదనీ, ఇప్పుడు విశిష్ట విద్యా కార్యక్రమాలకు ఈయబడుతున్న కేంద్రనిధులు ఈ విధానంయొక్క విస్తృత రూపమేకాక, ప్రతిబింబ ప్రాయాలు కూడా అనీ చెప్పవచ్చు. కేంద్రం విద్యకిచ్చిన ప్రాముఖ్యం ఎంతో కేంద్రవిద్యా కార్యాలయాన్ని నెలకొల్పటంలో కూడా ప్రదర్శితమైంది. 1867 లో వాషింగ్టన్ నగరంలో కేంద్ర విద్యా కార్యాలయాన్ని కాంగ్రెస్ నెలకొల్పింది. వివిధ రాష్ట్రాలలోనూ,



వంట - విద్యలో ఒక భాగమే

వివిధ ప్రాంతాలలోనూ విద్యాపరిస్థితి అభివృద్ధి ఎలా ఉన్నాయో తెల్పే సంఖ్యలనూ, సంగతులనూ సేకరించటానికి, సంయుక్తరాష్ట్రాల ప్రజలకు సమర్థమైన పాఠశాలా పథకాలను ఏర్పాటుచేసి, వాటిని పోషించటానికి, దేశమంతటిలోనూ విద్యావ్యాప్తి కొనసాగించటానికి, తోడ్పడే విధంగా పాఠశాలల నిర్మాణం, పరిపాలన, బోధనా పద్ధతులు మున్నగు విషయాలలో అవసర సమాచారం అందజేయటానికి, ఈ కార్యాలయం నెలకొల్పబడింది.

కేంద్రప్రభుత్వం ఈ కార్యాలయం ద్వారా ఏ ఒక్కొక్క రాష్ట్రంగానీ, ఏ ప్రత్యేక విద్యాసంస్థగానీ, చేయజాలనంత సేవ విద్యారంగానికి చేసింది. ఈ చట్టంక్రింద ముఖ్యంగా విద్యా విషయాలకు సంబంధించిన సమాచారాన్ని సేకరించటం, దాన్ని వ్యాఖ్యానించటం, తగిన సూచన

లివ్వటం, విద్యావిషయక పరిశీలనల ద్వారాను, కార్యక్రమాల ద్వారాను, సమావేశాల ద్వారాను, ఆ యా రాష్ట్రాలలో విద్యావ్యాప్తికి దోహదం చేసి ప్రోత్సహించటం జరిగాయి. ఇటీవలి సంవత్సరాలలో కేంద్ర విద్యా కార్యాలయానికి కొన్ని పరిపాలనాధికారాలను గూడా సంయుక్తరాష్ట్రాల కాంగ్రెస్ దఖలుచేసింది. ఉదాహరణకు - రాష్ట్రప్రభుత్వాల సహకారంతో వృత్తివిద్యా కార్యక్రమ నిర్వహణకూ, ప్రత్యేక ప్రాంతాల్లో నివసించే పిల్లలకు, కేంద్ర కార్యక్రమాలు కారణంగా పిల్లలసంఖ్య ఎక్కువైన పాఠశాలా మండలాలలో వున్న పిల్లలకు విద్య బోధించటంలో సహాయక చర్యలు తీసుకోటానికే, ఉపాధ్యాయులను అంతర్జాతీయంగా ఇచ్చి పుచ్చుకోవటంలో ప్రభుత్వం సహాయం అందజేయటానికీ ఇప్పుడు ఈ కార్యాలయానికి అధికారం ఈయబడింది.

ఈ సందర్భంలో తక్కిన కేంద్రసంస్థలు ప్రత్యేక విద్యా కార్యక్రమాలను నిర్వహిస్తాయి. వ్యావసాయిక విస్తరణ కార్యక్రమం, పాఠశాలా భోజన వసతి పద్ధతి - ఈ రెండూ వ్యవసాయశాఖ ఆధ్వర్యంలో జరుగుతున్నాయి. కోశాగార శాఖ క్రింద పాఠశాలల్లో పొదుపు ఉద్యమం నిర్వహింప బడుతున్నది. న్యాయశాఖక్రింద పౌరవిద్య నేర్పబడుతున్నది. దేశీయ భద్రతాసంస్థ క్రింద ఆ యా వృత్తుల పునరుద్ధరణ కార్యక్రమం నెరవేర్చబడుతున్నది. దేశీయ శాఖక్రింద భారతీయులు నివసిస్తున్న ప్రత్యేక ప్రాంతాలలో భారతీయ విద్య బోధింపబడు తున్నది. సైనిక నావిక వైమానిక శాఖలలో స్త్రీ పురుషులకు సాయుధ దళాల శిక్షణ సమకూర్చబడు తున్నది. ఇవన్నీ పైని చెప్పబడిన కార్యక్రమాలలో కొన్ని మాత్రమే.



వండిన వంటకాలకు రుచి పరీక్ష

## 3- రాష్ట్రం - విద్య

సంయుక్త రాష్ట్రాల రాజ్యాంగం ప్రకారం విద్య కేంద్ర ప్రభుత్వాధీనంలోని అంశం కాదు. రాజ్యాంగం ద్వారా సంయుక్త రాష్ట్రాలకు ప్రత్యేకించబడిన అధికారాలూ, ఆ యా రాష్ట్రాలకు లేనట్లు పేర్కొనబడినవీ, రాష్ట్ర ప్రభుత్వాలకుగానీ ప్రజలకుగానీ వుంటాయని రాజ్యాంగంలోని 10 వ సవరణ స్పష్టం చేస్తున్నది. సంయుక్త రాష్ట్రాలలో ప్రభుత్వానికి పునాదు లేర్పడిన నాటినుంచీ ప్రతిరాష్ట్రం యొక్క ప్రాథమిక మౌలిక న్యాయసూత్రాలలో విద్యకు అవకాశాలు కల్పించబడ్డాయి.

విద్యా విషయాలలో రాష్ట్రమే ప్రాతిపదిక. దానికి అధికారం ఇచ్చేది శాసనసభ. ప్రజలయొక్క సర్వ స్వతంత్రమైన అభిప్రాయానికి ప్రాతినిధ్యం వహించి ప్రతి రాష్ట్రీయ శాసనసభ తన రాజ్యాంగానికి లోబడి, అన్నివిధాలా విద్యావిధానాన్ని తన ఆధీనంలో ఉంచుకొనే అధికారం కలిగివుంది. పాఠశాలల నిర్వహణాధికారాన్ని ఒక రాష్ట్రీయ సంస్థ నిర్వహించవలెనో, లేక ఆ అధికారం రాష్ట్రీయంగా పురపాలక సంఘాలకూ, మండలిక సంస్థలకూ అప్పగించవలెనో నిర్ణయించే అధికారం ఆ యా రాష్ట్ర శాసనసభలకు ఉన్నది. సాధారణంగా రాష్ట్ర శాసనసభలు ఈ అధికారాన్ని - పాఠశాలల నిర్వహణ, పరిపాలన, పరిశీలన- ఆ యా ప్రభుత్వ విద్యాధికారులకు స్థానిక పాఠశాలాధికారులకూ అప్పగిస్తాయి.

48 రాష్ట్రాలలోనూ, ప్రతి రాష్ట్రానికీ తన కనువైన విద్యావిధానాన్ని సిద్ధపరచుకొనే అధికార బాధ్యత లుండటం వల్ల, వివిధ రాష్ట్రాల లోని విద్యావిషయిక సిద్ధాంతాలు, వాటి ఆచరణ వివిధ విధాలుగా వుంటాయి. ఈ భేదాలు అలావుంచి, దేశీయ సంస్థలు ప్రాథమిక - ఉన్నత విద్య విషయంలో చాలా సర్వ సామాన్య లక్షణాలు కలిగి వున్నాయి. ఉదాహరణకు - ప్రతి రాష్ట్రంలోనూ ప్రభుత్వ ప్రధాన పాఠశాలాధికారి ఒకరు ఉంటారు. ఆయనను 'కమిషనర్ ఆఫ్ ఎడ్యుకేషన్' అనిగానీ, 'సూపరింటెండెంట్ ఆఫ్ పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్' అని గానీ అంటారు. చాలా రాష్ట్రాలలో ఎన్నిక మూలంగా అధికారంలోకి వచ్చే ఈ ప్రధానాధికారి, రాష్ట్ర విద్యాశాఖకు అధిపతిగా గానీ, కార్య నిర్వాహకోద్యోగిగా గానీ వుంటారు.

చాలా రాష్ట్రాలు (40) చట్టబద్ధంగా రాష్ట్రీయ విద్యా విధానాలను రూపొందించే అధికారం గల రాష్ట్రీయ విద్యాసంస్థలను నెలకొల్పాయి. అయితే విద్యా విధానాలను రూపొందించటం ఒక సమిష్టి కార్యంగా



రిహార్సల్సు

జరుగవలసి యున్నది. రాష్ట్రీయాధికారి పాఠశాలా సమాచారం, పరిస్థితులు నివేదించి, విద్యా విధానాలను గురించి అవసరమైన సూచనలు రాష్ట్ర విద్యాసంస్థకు అందజేయాలి. ఆ సూచనలను పరిశీలించి రాష్ట్రీయ విద్యాసంస్థ తగుచర్య తీసుకుంటుంది. వృత్తి విద్యలకోసం ప్రతి రాష్ట్రంలోనూ ఒక ప్రత్యేక శాఖ వుంది. కేంద్రార్థిక సహాయం లభించే వృత్తి విద్యా కార్యక్రమాలను అమలుజరిపే బాధ్యత ఈ సంస్థది. చాలా రాష్ట్రాలలో ప్రభుత్వ విద్యాసంస్థయే వృత్తి విద్యాసంస్థగాకూడా పనిచేస్తుంది. కొన్ని రాష్ట్రాలలో సంయుక్త ప్రభుత్వ విద్యా విధానం అమలులో వుంది. ఈ రాష్ట్రాలలో అన్ని విద్యా కార్యక్రమాలూ, ఉన్నత విద్యతో సహా, ప్రభుత్వ ఉన్నత విద్యాసంస్థ యొక్క పరిపాలనాపరిశీలనల క్రింద వుంటాయి.

రాష్ట్రీ విద్యాసంస్థల కార్యక్రమాలు పరిపాలనకూ, పరిపోషణకూ, అభివృద్ధికి తోడ్పడేవిగా మూడు విధాలుగా వుంటాయి. దేశీయ పాఠశాలా కార్యక్రమాన్నీ, ఆ యా స్థానిక కేంద్రాల యందలి విద్యనూ, ఆచరణలో ప్రోత్సహించి పెంపొందించటం కోసం తీసుకొనే చర్యలే అభివృద్ధి చర్యలు, ఆ యా విద్యా కార్యక్రమాల వర్తమానాన్ని సేకరించి, అన్ని సంస్థలకూ అందజేయటం, పరిశోధనాత్మకమైన విద్యను నిర్వహించటం, స్థానిక పాఠశాలాధికారులకు తగిన సలహా సహకారాలు ఇవ్వటం - రాష్ట్రీయ విద్యాసంస్థల కార్యక్రమాలలో ముఖ్యమైనవి.

ఆ యా స్థానిక విద్యాసంస్థలు అవలంబింప వల సిన కొన్ని కనీస ధర్మాలనూ, విద్యా ప్రమాణాన్నీ నిర్ణయించే అధికారం సాధారణంగా రాష్ట్రీయ విద్యాసంస్థలకే వుంటుంది. ఉదాహరణకు - ఉపాధ్యాయులు, ఉపాధ్యాయులు కావటానికి ముందు కొన్ని యోగ్యతలు కలిగివుండాలని రాష్ట్రీయ విద్యాసంస్థ నిబంధిస్తుంది. పాఠశాలా భవనాలు కట్టేముందు, అవి ఇలా వుండాలని నిర్ణయించటం, బడి పిల్లలను తీసికొని పోయే బస్సులు, ఆ పిల్లల భద్రతదృష్ట్యా, ఇలాంటి ఇలాంటి స్థితిలో వుండాలని నిర్ణయించటం - రాష్ట్రీయ విద్యాసంస్థకు పరిపాటి.

ప్రభుత్వ పాఠశాలలను గానీ, విద్యా కార్యక్రమాలనుగానీ నిర్వహించటం ఈ సంస్థ పని. ఉదాహణంగా వయోజన విద్యాబోధనచేసే ఉపాధ్యాయులకు శిక్షణఇచ్చే ఉపాధ్యాయ కళాశాలలను నెలకొల్పటం, నిర్వహించటం అనేది చాలా రాష్ట్రాలలో రాష్ట్రీయ విద్యాసంస్థలు సాధికారంగా తన పర్యవేక్షణలో నడుపుతున్న ప్రధాన కార్యక్రమం. చాలా రాష్ట్రాలలో ఈ రాష్ట్రీయ విద్యాసంస్థలు నెలకొల్పబడ్డాయి. ఉన్నత విద్యా కార్యక్రమ నిర్వహణమే ఈ సంస్థల ప్రధాన బాధ్యత.



విజ్ఞానశాస్త్ర బోధ

## 4- స్థానిక పాఠశాలా సంస్థలు - నిర్వహణ

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో స్థానిక పాఠశాలా సంస్థలక్రింద విద్య ఎంతగా వృద్ధిపొందుతున్నదో చూస్తే, అమెరికా విద్యావిధానంలోని విశిష్టత బోధపడుతుంది. మొదటినుంచీ అమెరికా విద్యా విధానంయొక్క ప్రత్యేకత ఇదే. తొలిరోజుల్లో, ఆ యా ప్రాంతాల ప్రజలు బాగా విడి వడియున్న రోజుల్లో, ఆ యా స్థానిక పాఠశాలలు బయటివారి ప్రమేయం గానీ, పెత్తనంగానీ లేకుండా, పెంపొందాయి. ఈనాడు కూడా ఆ యా విద్యా కార్యక్రమాలను నిర్వహించటానికీ, పరిశీలించటానికీ ఆ యా స్థానిక పాఠశాలాధికారులే ఎక్కువగా బాధ్యులు.

పాఠశాలలను ఏ పద్ధతులమీద స్థాపించి నిర్వహించవలెనో నిర్ణ యించే అధికారం ప్రజాభిప్రాయానికి ప్రాతినిధ్యం వహించే రాష్ట్ర శాసనసభకు మాత్రమే ఉన్నది. ఆ సభవారు అవసరమనుకొన్న విధంగా ఆ యా విధానాలను రూపొందించవచ్చు. ఒక విధానాన్ని ప్రయత్నించి అది విఫలమైనప్పుడు ప్రభుత్వం మరొక విధానాన్ని గ్రహించగూడదని నియమంలేదు. కాని ఎల్లప్పుడూ, కానరాని ప్రాత కాలిజాడలను పట్టు కొని, దిక్కు తెలియని తీరున, పోబూడదు. అమెరికా విద్యారంగంలో స్థానిక సంస్థలు విద్యావ్యాప్తికి చాలా దోహదం చేశాయి, అదే ఆ సంస్థ లకు మిక్కిలి బలం చేకూర్చింది. పాఠశాలా నిర్వహణలో రాష్ట్ర ప్రభు త్వం ఇంకా ఎక్కువ బాధ్యతలను తీసుకోవాలనే అభిప్రాయం వుంది. డెలావేర్, నెవడా, ఉత్తర కరోలినా మొదలైన రాష్ట్రాలలో రాష్ట్ర ప్రభు త్వమే ప్రధాన బాధ్యత వహిస్తున్నది.

ప్రాథమిక - ఉన్నత విద్యావ్యాప్తిదృష్ట్యా విద్యామండలి ఆ యా రాష్ట్రాలను భౌగోళిక పరిస్థితులనుబట్టి వివిధ మండలాలుగా విభజిం చింది. ఒక రాష్ట్రంలో ఇలాంటి మండలాలు 24 ఉన్నాయి. తక్కిన వాటిలో వేనకువేలుగా ఉన్నాయి. ఇటీవల దేశంలోని పల్లెప్రాంతాలలో ఆ యా స్థానిక విద్యాసంస్థలు అధిక కృషి చేయాలనే పూనికవల్ల విద్యా వ్యాప్తి తగినంతగా జరుగుతున్నది. విద్యా మండలాలను పునర్నిర్మించ టం వల్ల, వాటి సంఖ్య తగ్గింది.

వివిధ రాష్ట్రాలలోని స్థానిక విద్యామండలాలను మొత్తం మూడు వర్గాలుగా పేర్కొనవచ్చు.

1. సాధారణ పాఠశాలా మండలం : ఇలాంటివి అమెరికాలోని సగం రాష్ట్రాలలో ఉన్నాయి. ఒక్కొక్క మండలం విస్తీర్ణం 18,20 చదరపు మైళ్ళుంటుంది. ఈ మండలాలు ఆ యా రాష్ట్ర పునర్నిర్మాణ కాలంలో ప్రాథమిక విద్యకోసం మొదట ఏర్పరుపబడ్డాయి. ఈ మండ



ఇంటిలోనూ విద్యాబోధే!

లాల సంఖ్యనుబట్టీ, విస్తీర్ణాన్నిబట్టీ చూస్తే, అవి ప్రాథమిక విద్యకోసం ఏర్పడినవే అని తెలుస్తుంది.

2. పట్టణ పాఠశాలా సమాఖ్య : ఇట్టివి కొత్త ఇంగ్లాండు రాష్ట్రాలన్నింటిలో వున్నాయి. ఇండియానా, న్యూజెర్సీ, పెన్సిల్వేనియాలలో కూడా తగుపాటి వ్యాప్తిలో వుంది. ఈ పట్టణ విద్యామండలం సాధారణ విద్యామండలం కంటె కొంచెం పెద్దదిగా వుంటుంది. దీని సగటు విస్తీర్ణం దాదాపు 28 చదరపు మైళ్ళుంటుంది.

3. ప్రాంతీయ విద్యామండలం : దాదాపు 12 రాష్ట్రాలలో ఈ ప్రాంతీయ విద్యామండలాలే పాఠశాలలను నిర్వహిస్తున్నాయి. ఈ

రాష్ట్రాలలో మండలాలసంఖ్య తక్కువ. కాని విస్తీర్ణం పెద్దది. ఆ యా పాఠశాలలను పోషించటానికి అవసరమైన ధన సంపత్తి కూడా ఈ మండలాలకు ఎక్కువగా వుంది. మేరీలాండులో ఇలాంటి 24 మండలా లుంటే, కెంటకీలో 384 ఉన్నాయి. వీటి సగటు విస్తీర్ణం సుమారు 145 చదరపు మైళ్ళు.

పై జెప్పిన ప్రతి విద్యాపరిపాలక ప్రాంతం ఒక విద్యామండలి అధీనంలో వుంటుంది. స్థానికంగా పాఠశాలలను నడిపే బాధ్యత ఈ మండలిది. విద్యామండలమును సామాన్యంగా ఆ ప్రాంతపు ప్రజలే ఎన్నుకొంటారు. కొన్ని సందర్భాలలో మాత్రం ప్రత్యేక నగరాలలో విద్యామండలమును ప్రభుత్వమే నియమిస్తుంది. విద్యామండలి సభ్యులు జీతం లేకుండా పనిచేస్తారు. పాఠశాలా పర్యవేక్షకు డనబడే ప్రధాన కార్య నిర్వాహకాధికారిని ఈ మండలి సభ్యులే నియమిస్తారు. స్థానిక విద్యా కార్యక్రమ నిర్వహణకై ఉపాధ్యాయులను నియమించటం, ఆ యా పాఠ శాలలకు తగు భవనాలు సమకూర్చి ఉన్నవాటికి మరమ్మతులు వగైరా చేయించటం, తక్కిన సాధనసామగ్రి సంపాదించి పెట్టటం, ఆ యా విద్యా కార్యక్రమాలకు అనుగుణమైన తక్కిన చర్యలు తీసుకోవటం - ఇవన్నీ ఈ విద్యామండలి చేయవలసిన పనులు. అయితే, రాష్ట్ర శాసన సభ రాష్ట్ర విద్యాసంస్థ నియమించిన మేరకు మాత్రమే ఈ విద్యామండలి సభ్యులకు అధికారం ఉంటుంది. ప్రభుత్వం సాధారణంగా ఒక కనీస ప్రమాణం నిర్ణయిస్తుంది. దీన్ని స్థానిక పాఠశాలా నిర్వాహక సంస్థలన్నీ పాటించవలసి వుంటుంది.

పాఠశాలా నిర్వహణకు గాను ఈ స్థానిక విద్యామండలమేగాక, చాలా రాష్ట్రాలలో చట్టబద్ధమైన అధికారాలతో పాఠశాలా పరిశీలకో ద్యోగు లుంటారు. వారిని ప్రాంతీయ పాఠశాలా పరిశీలకు లంటారు. అట్టి అధికారులు క్రొత్త ఇంగ్లాండు రాష్ట్రా లారింటిలో, న్యూయార్కు

లో, డెలావేర్‌లో, నెవాడాలో తప్ప, తక్కిన అన్ని రాష్ట్రాల్లోనూ వున్నారు. ఈ ప్రాంతీయ పరిశీలకోద్యోగి, ప్రత్యేక పరిశీలకాధికారులు ఉన్న ప్రత్యేక నగరాలలోనూ పట్టణాలలోనూ కాక, సాధారణంగా స్థానిక పాఠశాలా పరిశీలకోద్యోగిగా, రాష్ట్ర విద్యాశాఖకూ స్థానిక విద్యా సంస్థకూ మధ్యవర్తిగా పనిచేస్తాడు. కొన్ని రాష్ట్రాలలో ఈ ప్రాంతీయ పరిశీలకోద్యోగి విద్యాశాఖా ప్రతినిధిగాను, లేదా స్థానిక పాఠశాలా నిర్వహణ విషయంలో ప్రభుత్వ పాఠశాలాధికారిగానూ వ్యవహరిస్తాడు.

## 5- విద్యాపోషణ

ఆయా రాష్ట్రాలు ఏర్పడిన నాటినుండి విద్యావ్యాప్తి ప్రధానంగా ప్రభుత్వ కర్తవ్యంగా గుర్తింపబడింది. చారిత్రకంగా చూస్తే, చట్టరీత్యా, ఆ యా పాఠశాలలను తగిన ధనం సమకూర్చి పోషించే బాధ్యత స్థానిక విద్యామండలాలమీద వుంది. అమెరికా విద్యావిధానంలో ఈ సమస్యను గురించి కొన్ని విశిష్టమైన వైఖరులు కన్పిస్తున్నాయి. ఇటీవలి పది పాతికేండ్లలో విద్యావేత్తలూ, శాసనసభ్యులూ విద్యాపోషణ విషయంలో ఈ క్రింది ప్రధానాంశాలను క్రమక్రమంగా గుర్తిస్తూ వచ్చారు :

1. ఉచిత విద్యావ్యాప్తికి ధనసహాయం చేయటం రాష్ట్ర ప్రభుత్వం తీసుకోవలసిన ప్రధాన బాధ్యత.

2. పాఠశాలా పోషణ విషయంలో ప్రభుత్వం పాల్గొనటం - అంటే, రాష్ట్రమంతటా దాదాపు తగినంతగా సమాన విద్యా సౌకర్యాలు కల్పించటానికి అది ఒకమార్గ మన్నమాట.

3. ఏ ప్రాంతంలోనైనా సరే బాలబాలికల విద్యావ్యాప్తికి ప్రభుత్వ ధనాన్ని వెచ్చించి, ప్రభుత్వం పాల్గొనటంవల్ల, అది ప్రజలమీద పన్నుల భారం సమంగా పంచటానికి సాధనం అవుతుంది.

అమెరికా విద్యావిధానంలో క్రమ క్రమంగా ఈ సూత్రాలను ఆమో దించటంవల్ల ప్రభుత్వం పెక్కు రాష్ట్రాలలో మరింత బాధ్యత వహించ టమూ, మరికొన్నిటిలో ప్రధాన బాధ్యత వహించటమూ జరిగాయి. రాష్ట్రమంతటా ఒక కనిష్ఠ విద్యాభివృద్ధి కోసం పాఠశాలలకు ధన సహాయంచేసే బాధ్యత ప్రభుత్వంమీద పడింది. పాఠశాలలకు ధనం సమ కూర్చే బాధ్యత ఆనాటి కానాడు ప్రభుత్వంమీద పడింది అనేదానికి ఈ క్రింది పట్టికలోని అంకెలే నిదర్శనం :

పదేండ్ల పై కాలంలో పెరిగిన ప్రభుత్వ బాధ్యత

| పాఠశాలా నిధుల మొత్తంలో ప్రభుత్వం సమకూర్చిన వాని శాతం | రాష్ట్రసంఖ్య 1939 - 40 | 1949 - 50 |
|---|---|---|
| 75 పైగా .... .... | 2 | 4 |
| 50 - 75 .... .... | 7 | 12 |
| 25 - 50 .... .... | 16 | 20 |
| 25 లోపు .... .... | 23 | 12 |

గడచిన పదేండ్లలో విద్యక్రింద ఖర్చైన మొత్తంలో ప్రభుత్వ బాధ్యత సగటున 30% నుండి దాదాపు 43% వరకూ పెరిగింది.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలోని ప్రతి రాష్ట్రంలో కూడా ప్రజలు చెల్లించేపన్నుతో నడపబడే ప్రాథమిక పాఠశాలలూ ఉన్నత పాఠశాలలూ ఉన్నాయి. ఒకటో అంతకంటె ఎక్కువో కళాశాలల్లో కూడా ప్రధానంగా పన్నుపై ఆధారపడేవి ఉన్నాయి. పన్నులతో నడిచే ప్రాథమికోన్నత పాఠశాలల్లో ప్రవేశరుసుము గానీ, జీతంగాని చెల్లించ నక్కరలేకుండా, చదువుకొనే అధికారం ప్రతి పిల్లవానికీ వుంది. చాలా

రాష్ట్రాల్లో కళాశాలలను ఉన్నత విద్యాసంస్థలను పన్నులపై ఆధారపడే పద్ధతి ననుసరించాయి. ఉపాధ్యాయ కళాశాలలూ, లలిత కళాశాలలూ, రాష్ట్ర విశ్వవిద్యాలయం లాంటివికూడా, కొన్ని మినహాయింపులతో, ఈ పద్ధతిమీద నడుపబడుతున్నాయి. ఈ సంస్థలు చాలాభాగం పన్నులపై ఆధారపడినవే. కాని ఆ మొత్తం వాటి పోషణకు చాలకపోవటంవల్ల మామూలుగా 'మెట్రిక్యులేషన్' రుసుమూ, జీతమూ వసూలు చేస్తారు.

## నిధి సేకరణ :

లోగడ చెప్పిన విధంగా సంయుక్తరాష్ట్రాల విద్యావిధానానికి సంబంధించి నంతవరకు, కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలూ ఆయా రాష్ట్రాల లోని స్థానిక పరిపాలన సంస్థలూ కలిసి పనిచేస్తాయి. ఈ మూడూ విద్యాభివృద్ధికై నిధిసేకరణలో పాల్గొంటాయి. ప్రస్తుతం ప్రాథమిక - ఉన్నత విద్యలకోసం అయ్యే మొత్తం పాఠశాలా నిధులలో మాటికి 2 వంతులు కేంద్రప్రభుత్వమూ, 43% రాష్ట్రప్రభుత్వమూ, 55% దాకా స్థానిక సంస్థలూ సమకూరుస్తాయి. మహోన్నత విద్యకోసం 11% కేంద్రమూ, 40 % రాష్ట్రమూ భరించగా, మిగతా 49 % జీతాలద్వారా, అవకాశాన్నిబట్టి విరాళాలద్వారా సేకరిస్తారు.

# 1947 - 48

## ప్రభుత్వ ప్రభుత్వేతర విద్యాసంస్థల ఆదాయం

(వేల డాలర్లలో)

| ఆదాయం వచ్చిన విధం | మొత్తం | ప్రాథమిక ఉన్నత విద్య | మహోన్నత విద్యాసంస్థలు | ప్రత్యేక బాలబాలికల వసతి విద్యాసంస్థలు |
|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 |
| పూర్తి మొత్తం | 64 92,638 | 48,41,555 | 15,38,076 | 1,13,007 |
| ప్రభుత్వ పాఠశాలలు | 52,21,753 | 43.11 534 | 8,10,917 | 99,302 |
| మొత్తం ప్రభుత్వం | 50,42,160 | 43.11,204 | 6,33,341 | 97,615 |
| కేంద్రం | 3,86,027 | 1,20.270 | 2,54,005 | 11,752 |
| రాష్ట్రం | 20,94,321 | 16,76,362 | 3,32,096 | 65,863 |
| ప్రాంతీయం, నగరం లేక మండలం | 25,61,812 | 25,14,572 | 47,240 | — |

| | | | | |
|---|---|---|---|---|
| విద్యార్థుల జీతం | 84,518 | — | 84,518 | — |
| దానధర్మాలు | 14,886 | 330 | 14,556 | — |
| ఇతర ఆదాయం | 80,189 | — | 78,502 | 1,687 |
| ప్రభుత్వేతర పాఠశాలలు | 12,70,885 | 5,30,021 | 7,27,159 | 13,705 |
| మొత్తం ప్రభుత్వం | 3,00,225 | — | 2,92,937 | 7,288 |
| కేంద్రం | 2,72,471 | — | 2,72,471 | — |
| రాష్ట్రం | 27,473 | — | 20,185 | 7,288 |
| ప్రాంతీయం, నగరం, లేక మండలం | 281 | — | 281 | — |
| విద్యార్థుల జీతం | 2,20,083 | — | 2,20,083 | — |
| దానధర్మాలు | 76,912 | — | 76 912 | — |
| ఇతర ఆదాయం | 6,73,199 | 5 30,021 | 1 37 227 | 5,951 |

## కేంద్ర సహాయం:

అన్ని రాష్ట్రాలలో విద్యావ్యాప్తి ప్రభుత్వ ప్రధాన బాధ్యతగా గుర్తింపబడినందువల్ల, కేంద్రప్రభుత్వం ఏండ్ల తరబడిగా విద్యావ్యాప్తికై ధనం సహాయం చేయటంద్వారా తన విద్యాసక్తిని వెల్లడించుకొన్నది. విద్యావ్యాప్తికిగాను 48 రాష్ట్రాలూ కేంద్ర ప్రభుత్వంనుండి భూమిగానీ ఇతర నిధులుగానీ ఇంకా తక్కిన సదుపాయాలు గానీ పొందాయి. ఉదాహరణంగా ప్రస్తుతము విద్యావ్యాప్తికొరకు కేంద్రసహాయము కళాశాలకు, వ్యవసాయక ప్రయోగ శాలలకు, వృత్తి విద్యాలయాలకు, వృత్తి పునరుద్ధరణకు, పాఠశాలా భోజన భవనాలకు, పాఠశాలా భవనాలకు, దేశరక్షణ మున్నగు చర్యలద్వారా దెబ్బతిన్న ప్రాంతాలలో పాఠశాలలు నెలకొల్పటానికి, సైనికుల విద్యాభివృద్ధికి అవసరమైన భూములను కేంద్రం మంజూరుచేసింది.

## రాష్ట్ర సహాయం:

ప్రభుత్వ పాఠశాలలకు ఆధారంగా వివిధమొత్తాలు కేటాయించటంలో ఒకే విధానాన్ని అవలంబించటం ఉచితమనీ, అవసరమనీ ప్రతి రాష్ట్రం గుర్తించింది. కొన్ని రాష్ట్రాలు పాఠశాలల హాజరునుబట్టి, లేక విద్యార్థుల సంఖ్యనుబట్టి ధనసహాయం చేసే పాతపద్ధతినే ఇంకా అనుసరిస్తున్నాయి. కాని మిక్కిలి అభివృద్ధి చెందిన రాష్ట్రాలు ఒక క్రొత్తపద్ధతిని రూపొందించాయి. దీనినే ప్రాతిపాదిక కార్యక్రమ విధానంఅంటారు. బిడ్డలందరికీ విద్యను అందుబాటులోకి తేవటంలో ప్రాతిపాదిక కార్యక్రమానికి ఎంతఖర్చు అవుతుందో నిర్ధారణ చేయటం ఈ వాస్తవిక పద్ధతిలోని ఒక అంశం. రెండవది - ఒక్కొక్క పాఠశాల దాని సామర్థ్యాలనుబట్టి సర్వసమానంగా ఎంతపన్ను రాబట్టగలదో నిర్ధారణ చేయటం. ఆ స్థానిక పాఠశాల వసూలుచేయగల నిధులకూ దానికి కావలసిన ఖర్చు



బాలవిద్యార్థులు నాటకం ప్రదర్శిస్తున్నారు

లకా ఉన్న తేడాను రాష్ట్రం భరించాలి. రాష్ట్ర నిధులూ స్థానిక నిధులూ కలిపి, ఇలా సమకూర్చే పద్ధతి, న్యాయంగా ప్రతిపిల్లవానికీ తగినంత విద్య అందజేయడంకోసం, ఏర్పరచబడింది.

## స్థానిక సహాయం :

ఇంతకుముందు సూచించినట్లుగా ప్రభుత్వపాఠశాలలు నడపటానికి కావలసిన స్థానిక నిధులలో చాలాభాగం ఆస్తిపన్నులద్వారా వసూలు చేయబడుతున్నాయి. కొన్ని రాష్ట్రాలలో పాఠశాలల కోసం ఇతర స్థానిక

నిధులను కేటాయించవలసి వుంది. కాని అలా వచ్చే రాబడి చాలా స్వల్పం.

చాలా విద్యామండలాలలో తగినంత డబ్బులేక పోవటంవల్ల, చాలా రాష్ట్రాలలో ఆస్తిని లెక్కకట్టే పద్ధతులలో పెక్కు తేడా లుండటం వల్ల, స్థానిక పాఠశాలా సహాయక నిధుల విషయంలో ప్రస్తుతం కొన్ని క్రొత్త సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. వీటివల్ల స్థానికంగా తగినంత ఆదాయం సంపాదించటం కష్టమవుతున్నది. సర్వసమానంగా ప్రభుత్వ నిధులను సంపాదించటం కష్టమవుతున్నది. ఏమైనా ఆస్తిలెక్క నిష్పత్తులను నిర్ణయించి ఉపయోగించటం ద్వారా ఈ సమస్యా పరిష్కారానికి పెక్కురాష్ట్రాలు సంతృప్తికరమైన పథకాలను తయారుచేశాయి.

కేంద్ర, రాష్ట్ర, స్థానిక ప్రభుత్వ నిధులను వినియోగించే విషయంలో చాలా రాష్ట్రాలలో ఆయా స్థానిక పాఠశాలాధికారులే బాధ్యులు. కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు ఇచ్చే నిధులకు తోడుగా స్థానికంగా ఎంతనిధి సమకూర్చుకోవాలో స్థానిక పాఠశాలాధికారులు నిర్ణయించుకొంటారు. వారికి నిధులను వసూలుచేసే అధికారం వుంది. కొన్ని ప్రాంతాలలో పాఠశాలాధికారులు తమ కవసరమైన నిధి ఇంత అని పైవారికి సిఫారసు చేసే అధికారం మాత్రమే వుంటుంది. ఆ నిధి అవసరమా కాదా నిర్ణయించే అధికారం మరొక ప్రభుత్వ సంస్థకు వుంటుంది. అలాంటి పరిస్థితుల్లో ఈ ద్వంద్వ బాధ్యతా ఫలితంగా పాఠశాలా నిధులను సమకూర్చటం అనే సమస్య కొంత జటిలం కావచ్చు.



వి।శ్రాంతిసమయాలలో ఫలహారాలు

## 6- ప్రభుత్వేతర పాఠశాలలు

అమెరికాలో తల్లిదండ్రులు తమ బిడ్డలను ప్రభుత్వాధీనంలోని పాఠశాలలకు గానీ, ప్రభుత్వేతర పాఠశాలలకు గానీ పంపే స్వేచ్ఛకలిగి వుంటారు. కాని ప్రభుత్వేతర పాఠశాలలకు తమ బిడ్డలను పంపే తల్లిదండ్రులు సైతం ప్రభుత్వ పాఠశాలల నిధికోసం పన్నుచెల్లించక తప్పదు. వ్యక్తుల అధీనంలోని ప్రాథమికోన్నత పాఠశాలలో చదువుకొనే పిల్లలసంఖ్య చాలా తక్కువ. ప్రాథమిక - ఉన్నత విద్యాస్థాయిలో

అటువంటి పిల్లలు 12% మాత్రమే. ఇక మహోన్నత విద్యాసంస్థలు ప్రభుత్వాధీనంలో కంటె, మతవర్గాల అధీనంలోను వ్యక్తుల అధీనంలోను రెట్టింపు ఉన్నాయి. అయినా ఇటువంటి ప్రభుత్వేతర కళాశాలలలోనూ, విశ్వ విద్యాలయాలలోను వసతి సౌకర్యంకల పిల్లలసంఖ్య దాదాపు ప్రభుత్వ కళాశాలలలోని, విశ్వ విద్యాలయాలలోని విద్యార్థుల సంఖ్యకు సమానం. పన్నుల ఆధారంలేకుండా, వ్యక్తుల ఆధీనంలో నడిచే పాఠశాలలు మతవర్గాల సహాయంతోగానీ, ఇతర దానధర్మాలవల్లగానీ, లాభవాంఛ లేకుండా నడుపబడుతున్నాయి. మరికొన్ని, తక్కువ అన్ని వ్యాపారాల మాదిరిగానే, పాఠశాలలు కూడా లాభదృష్టితో నడుపబడేవి ఉన్నాయి. దాదాపు అన్ని రాష్ట్రాలలోను దాన ధర్మాలమీద వైయక్తికంగా నడపబడే ఉన్నత విద్యాసంస్థలు ఉన్నాయి. వీటికి సామాన్యంగా కొన్ని మతవర్గాల ఆసరా వుంటుంది. ఈ పాఠశాలలలో పనులుచేసే జీతం వగైరా వానికున్న ధర్మాదాయం మతవర్గాలు అందజేసే సహాయం మీద ఆధారపడి వుండటంవల్ల వేరు వేరుగా వుంటాయి.



విద్యాబోధ: శరీరశాస్త్రం

## 7. నిర్బంధ విద్య

దేశం నడిబొడ్డునగల సంయుక్తరాష్ట్రాలలోను, ముఖ్యమైన సరిహద్దు ప్రాంతాలలోను, ఉచిత విద్యయేకాక, నిర్బంధ విద్యకూడా అమలులో వుంది. 1918 మొదలుకొని ప్రతి రాష్ట్రంలోనూ చట్టం ప్రకారం ప్రతిపిల్లవాడూ పాఠశాలకు హాజరై తీరాలి. ప్రతిరాష్ట్రంలోనూ తప్పనిసరిగా బడికి హాజరు కావాలనే నిబంధనల ప్రకారం ఏదో ఒక ప్రభుత్వ పాఠశాలకు గానీ, ప్రభుత్వేతర పాఠశాలకు గానీ ఒకానొక వయః పరిమితికి లోబడిన పిల్లలందరూ హాజరై తీరాలి.

చాలా రాష్ట్రాలలో ఈ పరిమితి 7 నుండి 16 ఏండ్లవరకూ. ఇప్పటి కిరువదేండ్లుగా ఈ విషయంలో చేయబడిన చట్టాలను పరిశీలిస్తే, కనీస వయస్సును ఇంకా తగ్గించి, గరిష్ఠ వయస్సును ఇంకా పెంచి బడికి హాజరు కావలసిన కాలాన్ని పొడిగించాలనే ధోరణి కన్పిస్తున్నది. పిల్లవాడు తప్పనిసరిగా బడికిపోవలసిన వయస్సు 6 నుండి 8 సంవత్సరాల మధ్య. అతడు ఈ హాజరు నిర్బంధంనుండి తప్పుకొనేది 16 నుండి 18 ఏండ్లనడుమ. ఇప్పుడు 33 రాష్ట్రాలలో తప్పనిసరిగా బడికి హాజరు కావలిసిన కాలం 9 ఏండ్లు.

బడి హాజరు నిబంధనను సడలించవలెనంటే ఆ విద్యార్థి ఆ వయస్సుకు మించిన విద్య నేర్చుకొని వుండాలి. దాదాపు సగం రాష్ట్రాలలో విద్యార్థి ప్రాథమిక పాఠశాల విద్యనంతటినీ-అంటే మామూలుగా 8 తరగతులు - పూర్తిచేసి నట్లయితే, ఆ పొందిన విద్యకారణంగా అతని విషయంలో హాజరు నిబంధన సడలించవచ్చు. దాదాపు 15 రాష్ట్రాలలో ఇందుకు ఉన్నత పాఠశాలా విద్యాప్రణాళికను పూర్తిచేసి వుండాలి. తక్కిన చాలా రాష్ట్రాలలో కేవలం చదువునుబట్టి మాత్రమే ఈ నిబంధనను సడలించరు. కాని చట్టబద్ధంగా వేరే వృత్తులలో నియమితులై యున్న పిల్లలకు మాత్రం ఈ సడలింపు ఉంటుంది.



బాలవిద్యార్థుల పఠనం

## 8- పాఠశాలా నిర్మాణం

సంయుక్త రాష్ట్రాల విద్యాక్రమాన్ని క్రింవటి పుటలోని పటం విశదం చేస్తుంది. ఆ బొమ్మలో కుడివైపున ప్రాథమిక పాఠశాలలు, ఉన్నత పాఠశాలలు (విద్యాత్మకములు, వృత్తి సంబంధులు, సాంకేతికములు) విశ్వవిద్యాలయాలు కళాశాలలు (వృత్తివిద్యాలయాలు వీనినే మహోన్నత విద్యాలయాలంటారు) అని విద్యావిధానం మూడు ప్రమాణాలుగా చూపబడింది. ఆ యా తరగతులలో సుమారుగా ఎంతవయస్సు వుంటుందో ఎడమవైపున చూపబడింది.

బొమ్మలో చూపబడిన త్రివిధ పథకాలు సామాన్యంగా వాడుకలో ఉన్నాయి. ఎడమన చూపబడిన పథకాన్ని మామూలు 8-4 పథక మంటారు. అంటే శిశుశాలల్లోను, బాల కేంద్రాలలోనూ శిక్షణ పొందాక 8 ఏండ్లు ప్రాథమిక పాఠశాలల్లోను, 4 ఏండ్లు ఉన్నత పాఠశాలల్లోను పిల్లలు చదువుకొంటారన్నమాట. ఇలాంటి పాఠశాల లెన్నోవున్నాయి. నడుమ చూపబడిన పథకం 6—3—3 పథకం అంటారు. అంటే శిశు బాలకేంద్రాల అనంతరం 6 ఏండ్లు (1 నుండి 6 తరగతులు) పాఠశాలల్లోనూ, 3 ఏండ్లు మాధ్యమిక పాఠశాలల్లోనూ, 3 ఏండ్లు ఉన్నత పాఠశాలల్లోనూ చదువుతా రన్నమాట. ఇలాంటి పాఠశాలలు కూడా చాలా వున్నాయి. కుడివైపున చూపిన పథకం 6—6 పథకం అంటారు. అంటే 6 ఏండ్లు ప్రాథమిక పాఠశాలల్లోనూ, 6 ఏండ్లు ఉన్నత పాఠశాలల్లోనూ చదవాలన్నమాట. ఈ మూడు పద్ధతుల ప్రకారం పటంలో ఎడమవైపున చూపిన ప్రకారం 17 లేక 18 ఏండ్ల కాలంలో ఉన్నతవిద్య పూర్తి అవుతుంది.

ఇందులో శిశుశాలలను, బాల కేంద్రాలను గురించి కొంత చెప్పాలి. 3—5 ఏండ్ల పిల్లలు శిశుశాలల్లోను, 4—6 నడిమి పిల్లలు బాల కేంద్రాలలోనూ వుంటారు. కాని ఈ వయస్సుల విషయంలో చాలా వ్యత్యాసాలున్నాయి.

బాలకేంద్రాలూ, శిశుశాలలూ అన్నీకూడా ప్రజాధనంతో నడప బడక పోవటంవల్ల, ఒకటవ తరగతినుండి ఉన్న తక్కిన పాఠశాలలు లాగా పూర్తిగా ప్రభుత్వ విద్యాశాఖ అధీనంలో లేవు. కొన్ని తల్లి దండ్రు లిచ్చే జీతాలవల్ల స్థానిక విరాళాలవల్ల నడుస్తున్నాయి. అసలు ఇట్టివే అధికం. మరీ పసిపిల్లలకోసం నడుపబడే కొన్ని శిశుశాలలు శిశు సంక్షేమ కేంద్రాలలోనే వున్నాయి. అవి ఆ యా స్థానిక పరిస్థితులనుబట్టి విద్యాశాఖ యాజమాన్యంలో ఉండవచ్చు, ఉండకపోవచ్చు. ఈ శిశు బాల కేంద్రాలను గురించి తర్వాత చర్చిద్దాం.

# 1947-48 పాఠశాలల సంఖ్య

| పాఠశాలలు | సంఖ్య |
| --- | --- |
| సంయుక్త రాష్ట్రాల మధ్యదేశం మొత్తం | 1,90,206 |
| ప్రాథమిక పాఠశాలలు (బాలకేంద్రాలతో సహా) | |
| ప్రభుత్వ పాఠశాలలు | 1,46,760 |
| ప్రభుత్వేతర ,, | 10,071 |
| ఉన్నత పాఠశాలలు | |
| ప్రభుత్వ ,, | 25,484 |
| ప్రభుత్వేతర ,, | 3,292 |
| మహోన్నత విద్యాలయాలు | |
| ప్రభుత్వ ,, | 630 |
| ప్రభుత్వేతర ,, | 1,158 |
| ప్రత్యేక బాలుర వసతి సౌకర్యంగల పాఠశాలలు | |
| ప్రభుత్వ ,, | 307 |
| ప్రభుత్వేతర ,, | 137 |
| ప్రభుత్వేతర వ్యాపార పాఠశాలలు | 1,300 |
| కళాశాలలకు విశ్వవిద్యాలయాలకు అనుబంధించిన నర్సింగ్ కేంద్రాలు | 1,067 |

# పూర్తికాల పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య

# 1947 - 48

| పాఠశాల | విద్యార్థుల సంఖ్య | | |
|---|---|---|---|
| | మొత్తం | బాలుర | బాలికలు |
| సంయుక్త రాష్ట్రాలు - మధ్యదేశం | 3,01,55,803 | 1,57,75,818 | 1.43,79,985 |
| బాలకేంద్రాలు - ప్రాథమిక | 2.07,75.605 | 1,06,77,649 | 1,00.97 956 |
| ప్రభుత్వ పాఠశాలలు | 1,83,14,902 | 94,40,869 | 88,74,033 |
| ప్రభుత్వేతర ,, | 24,60,703 | 12,36,780 | 12,23,923 |
| ఉన్నత ,, | 62,95,384 | 30,58,123 | 32,37,261 |
| ప్రభుత్వ ,, | 56,67,571 | 27,54,192 | 29,13,379 |
| ప్రభుత్వేతర ,, | 6,27.813 | 3,03,931 | 3,23,882 |
| మహోన్నత పాఠశాలలు | 26,16,262 | 18,36,339 | 7,79,963 |

| | | | |
|---|---|---|---|
| ప్రభుత్వ ,, | 13,26.147 | 9,30,665 | 3,95,482 |
| ప్రభుత్వేతర ,, | 12,90,115 | 9,05,674 | 3,84,441 |
| ప్రత్యేక బాలుర వసతి పాఠశాలలు | 63.137 | 38,174 | 24 663 |
| ప్రభుత్వ ,, | 54,032 | 32,777 | 21,255 |
| ప్రభుత్వేతర ,, | 9.105 | 5,697 | 3,408 |
| ప్రభుత్వేతర వ్యాపార పాఠశాలలు | 3,00,000 | 1,50,000 | 1.50,000 |
| కళాశాలా విశ్వవిద్యాలయాలకు అనుబంధించిన నర్సింగ్ కేంద్రాలు | 75,133 | 698 | 74,435 |
| ప్రభుత్వ ,, | 9,759 | 90 | 9,669 |
| ప్రభుత్వేతర ,, | 65,374 | 608 | 64,766 |
| భారతీయులకు కేంద్ర పాఠశాలలు | 30,282 | 11,535 | 15 747 |

# 9- స్థానిక విద్యా కార్యక్రమాలు

## ప్రాథమిక విద్య

పూర్వపు వలస రోజుల నాటినుంచీ నేటి వరకూ అమెరికాలో ప్రాథమిక విద్య అంటే 6 మొదలు 14 సంవత్సరాలలోపు పిల్లలకోసం ఏర్పడిన విద్య అని అర్థం. ఏ ఏ వయస్సులలో తప్పనిసరిగానూ, ఐచ్ఛికంగానూ బడికి హాజరుకావాలి? ఏ షరతులకు లోబడి పాఠశాలలలో చేరవచ్చును? లేదా, మానుకోవచ్చును? - అనేది ఆ యా రాష్ట్రాల, లేక స్థానిక పరిస్థితులనుబట్టి వుంటుంది. బడికి హాజరయ్యే పిల్లల విషయంలో పాఠశాలాధికారుల బాధ్యత పాఠశాల పనిచేసే 8, 9 లేక 10 మాసాలలో రోజుకు ఐదారు గంటలపాటు మాత్రమే.

ప్రభుత్వ ప్రాథమిక విద్యాసంస్థలలో 5, 4, 3 సంవత్సరాల పిల్లలను కూడా చేర్చుకోవాలనీ, బడికి తప్పక హాజరుకావలసిన వయఃపరిమితి పెంచాలనీ, పిల్లల విషయంలో రోజువారీగానూ ఏడాదిమీదా బడి బాధ్యత పెంచాలనీ - ఇటీవల ఒక ఆలోచన ఉంది.

ఈ వర్గంవారు ప్రాథమిక విద్యాలక్ష్యాలను గురించీ, విద్యాక్రమం గురించీ ప్రాథమిక విద్యాప్రణాళిక గురించీ చర్చిస్తుంటారు.

## లక్ష్యాలు

సామాజిక జీవితం బహుముఖంగా విస్తృతమవుతున్నకొద్దీ విద్య మిక్కిలి ఆవశ్యక మవుతున్నది. అందువల్ల ప్రాథమిక పాఠశాలలు మరింత బాధ్యత తీసుకోవాలి. పిల్లవానియొక్క సంపూర్ణ వికాసమే అమెరికా విద్యకు పరమావధి. మన పిల్లల ప్రాథమికావసరాలనుబట్టి, మన సమాజ సాముదాయకావసరాలనుబట్టి, ప్రాథమిక విద్యాలక్ష్యాలు కూడా విస్తరిస్తాయి. ఈ లక్ష్యాలు వ్యక్తుల వికాసానికీ, సాంఘిక వర్గాల



విద్యార్థులకు వైద్యపరీక్ష

వికాసానికి దారితీస్తాయి. కాబట్టి ఇవి వ్యక్తిగతంగానూ, సాంఘికంగానూ వుంటాయి.

పిల్లలకు పాఠశాలలు చేకూర్చవలసిన ప్రయోజనాన్ని చెప్పినపుడు, ప్రాథమిక విద్యాలక్ష్యాలు తేటతెల్లమవుతాయి. ప్రతి పిల్లవాడు తన శక్తి సామర్థ్యాల ననుసరించి పొందదగిన కొన్ని స్పష్టమైన లక్ష్యాలు ఆధారంగా అమెరికాలో ప్రాథమిక పాఠశాలలు పనిచేస్తాయి.

ప్రతిపిల్లవాడూ ఆరోగ్యవంతమైన శరీరమును, స్వచ్ఛమైన మనోవృత్తులను పెంపొందించుకోటానికి ఈ విద్య సహాయపడాలి. శారీరక భావుక మానసిక ఆరోగ్యాన్ని సాధించటమే విద్యాలక్ష్యాలకు మూలం.

పిల్లలు తమ ఆరోగ్యాన్ని గురించీ భౌతికావసరాలను గురించీ శ్రద్ధ వహించేటట్లు చేయటం పాఠశాల బాధ్యత. చక్కని మానసిక వైఖరిని సాంఘిక దృష్టిని అలవరచుకొనేటట్లు చేసే బాధ్యత పాఠశాలది.

విజ్ఞాన సాధనాలను ఉపయోగించు కొనటంలో ప్రతిపిల్లవాడూ సమర్థుడు కావాలి. ఈ నవీన ప్రపంచంలో తెలివితేటలతో ప్రవర్తించాలంటే, చదవటం వ్రాయటం ఆలోచించటం వివేచించటం నలుగురితో కలిసి మెలిసి వుండటం నేర్చుకొనివుండాలి. విద్యార్థులు పెరిగి పెంపొందటానికి సహాయపడే ఈ బాధ్యతను ప్రాథమిక పాఠశాల తనదిగా గుర్తిస్తుంది. పిల్లలు ఈ శక్తిసామర్థ్యాలను ఎలా పెంపొందించుకొంటారో తెలిసికొని, ప్రాథమిక పాఠశాలలు ఉత్తమ పద్ధతుల్లో వారి అభివృద్ధికి దోహదం చేయటం ముఖ్యం.

ప్రతి పిల్లవాడూ తన వ్యక్తిగతమైన సాంఘికమైన సమస్యలలో పాల్గొని, వాటిని పరిష్కరించటానికి సమర్థుడై వుండాలి. వ్యక్తులు సమావేశమై తమ సమస్యలను పరిష్కరించుకోటానికి తోడ్పడటం అమెరికాలోని సద్విద్యా ప్రయోజనాలలో ఒకటి. పెద్దలలాగానే పిల్లలుకూడా ఆరోగ్యం, భద్రత, విశ్రాంతి, కుటుంబ సంబంధాలు, సంఘజీవితం, కొనుట-అమ్మట, డబ్బు దాచటం, పొదుపు - మొదలైన వాటిని గురించి నిజమైన సమస్యలనే తరచుగా ఎదుర్కొంటారు. పిల్లలు తమ నిత్య జీవితావసరాల విషయంలో సమర్థంగా వ్యవహరించాలంటే సమర్థమైన నిత్య జీవితానికి అవసరమైన అనుభవాన్ని వారు పొందేవిధంగా పాఠశాల దోహదం చేయాలి.

ప్రతిపిల్లవాడూ యోగ్యములైన ఉత్సాహకరములైన సృజనాత్మక అభిలాషలను, శక్తిసామర్థ్యాలను వృద్ధిచేసుకోవాలి. నవీనప్రపంచంలోమారుతున్న పరదాల స్వభావాన్నిబట్టి, వ్యక్తి వికాసానికి అలాంటి ఉత్సాహంయొక్క ప్రాముఖ్యాన్ని బట్టి, పిల్లలు, యోగ్యములైన ఔత్సాహిక సృజనాత్మ

కాభిలాషలను సమర్థతలను పెంపొందించుకొనే అవకాశాలు కల్పించే కార్యక్రమం అగత్య మవుతున్నది. ఈ అవకాశాలను కల్పించటంలో తోడ్పడే బాధ్యతను ప్రాథమిక పాఠశాల వహిస్తుంది.

ప్రతిపిల్లవాడూ తన శక్తి సామర్థ్యాలనుబట్టి అభివృద్ధిపొందే అవకాశం వుండాలి. ప్రతి వ్యక్తికీ తనలోనున్న ఉత్తమ శక్తి సామర్థ్యాలను పెంపొందించుకొనే అవకాశం కల్పించటమే ప్రజాస్వామ్యంయొక్క భావం. సంపూర్ణ మానవత్వ వికాసానికి ముందు సాధారణ కార్య విజయమూ, ఫలసిద్ధీ అవసరం, ప్రాథమిక పాఠశాలా కార్యక్రమంలో ప్రతి పిల్లవాడూ తన బలాబలాలను తెలిసికొనే అవకాశం వుంది. అంటే వారి వారి అభిలాషలను శక్తిసామర్థ్యాలను కనుగొని వాటి అభివృద్ధికి కృషి చేయడానికి తోడ్పడుతుంది.

ప్రతి పిల్లవాడూ తానొక్కడుగా నున్న ఈ సాంఘిక భౌతిక వాతావరణాన్ని అర్థంచేసుకోటం నేర్చుకోవలసి వుంది. తమ పరిసర పరిస్థితులనూ, సమస్యలనూ పరిశీలించే శక్తిని పిల్లలు పొందేటట్లు చేయాలి. ఈ జాగృతి క్రమశః పెంపొంది పిల్లవాని సమాజాన్ని ప్రపంచాన్నీ విస్తృతంచేసి, అతడు ఇతరులమీద ఎలా ఆధారపడి వున్నాడో గుర్తింపజేసి, చక్కని మానవ సంబంధాలకు గల అవసరాన్ని బోధించాలి. పిల్లవాడు వర్తమాన జీవితాన్ని గమనించటమే గాక గతాన్ని కూడా తెలిసికొని అర్థం చేసుకొనేటట్లు చేయాలి.

ప్రతి పిల్లవాడూ అన్ని జీవిత రంగాలకూ అనువర్తించే విధంగా ప్రజాస్వామ్యాన్ని అర్థంచేసికొని పెంపొందే అవకాశం కల్పించాలి. ప్రజా స్వామ్యాన్ని అర్థం చేసుకొని ఆచరణలో బెట్టిన ఒక ప్రజాస్వామ్యంలో చక్కగా పాల్గొనటానికి అవసరమైన వ్యక్తిగత ప్రవర్తనను పెంపొందించుకోటానికి పిల్లలకు తోడ్పడటం పాఠశాలా ప్రధాన లక్ష్యాలలో ఒకటి. తక్కిన అన్ని లక్ష్యాలూ విజయవంతంగా సాధించినప్పుడు, అమెరికా ప్రముఖ సంప్రదాయమైన ఈ ప్రజాస్వామ్య శిక్షణకూడా సాధింప బడుతుంది.

# 10- 6 – 14 సం॥ల పిల్లల ప్రాథమిక విద్య

ప్రాథమిక పాఠశాలా నియంత్రణం అనేక అంశాలపై ఆధారపడి వుంటుంది. కొన్ని పల్లెప్రాంతాలలో చాలాభాగం ప్రాథమిక తరగతు లన్నీ ఒకేగదిలో ఒకే ఉపాధ్యాయునిక్రింద వుంటాయి. పెద్దపెద్ద గ్రామా ల్లోనూ, పట్టణాలలోనూ, ఉండే బడులలో తరగతికొక గదీ, ఒక ఉపా ధ్యాయుడూ వుంటారు. సంయుక్త రాష్ట్రాలలో ఒక ఉపాధ్యాయునిక్రింద ఉండవలసిన పిల్లలసంఖ్య వివిధ విధాలుగా వుంటుంది. ఈ సంఖ్య 25—30 కి పరిమితం కావాలనే ధోరణి అధికంగా వుంది. 1, 2 గదుల చిన్న చిన్న మారుమూల బడులలోకంటె ఎక్కువ సౌకర్యాలున్న పెద్దపాఠశాలలకు పంపటం ఇప్పటి ప్రయాణసౌకర్యాల దృష్ట్యాసాధ్యమే. కొన్ని ప్రాంతాలలో 7, 8, 9, తరగతులుండే మాధ్యమికోన్నత పాఠ శాలల్లో 7, 8 తరగతుల పిల్లలను చేర్చుకొంటారు.

## ప రి పా ల న :

మామూలుగా ప్రతి ప్రాథమిక పాఠశాల ఒక ప్రధానోపాధ్యా యుని పరిపాలనలో ఉంటుంది. ఆయన ఆ బడిలో పూర్తికాలం గానీ; కొంతకాలంగానీ ఉపాధ్యాయుడుగా వుంటాడు. పిల్లలయొక్క క్షేమా నికీ, అభివృద్ధికీ, బడియొక్క సామర్థ్యానికీ, అభ్యుదయ కార్యక్రమానికీ, ఉపాధ్యాయుల వృత్తి సంబంధమైన వృద్ధికీ, బడికీ జాతికీ తక్కిన విద్యా సంస్థలకూ గల సంబంధాలకూ సాధారణంగా ప్రధానోపాధ్యా యుడే బాధ్యుడు.

సంయుక్త రాష్ట్రాలలో ప్రధానోపాధ్యాయుని కర్తవ్యం బిడ్డల శిక్షణ విషయంలోనూ, ప్రజాస్వామిక సంబంధాలను నిలబెట్టటంలోనూ, సమర్థంగా నిర్వహింపబడే టందుకు తల్లిదండ్రులు తక్కిన ఉపాధ్యా యులు కనిపెట్టి వుంటారు. పాఠశాల నిర్వహణలో తల్లిదండ్రులకు

తక్కిన పౌరులకు ఉపాధ్యాయులకు కొంతవరకు పిల్లలకు బడి ఎలా పనిచేయాలో నిశ్చయించటానికి తోడ్పడే అవకాశం కల్పించాలనేది ఇప్పటి దృక్పథం. ప్రధానోపాధ్యాయుని కార్యరంగాన్ని ఈ పద్ధతి చాలా విస్తృతం చేస్తుంది. కాని పరస్పర సహకారంతో జరిగే ఈ కృషి ఫలితంగా ఏర్పడే అన్యోన్యతా సామరస్యాలు బడికి బలం చేకూర్చుతాయి.

## ప్రాథమిక పాఠశాలా కార్యక్రమం :

ప్రాథమిక పాఠశాలల కార్యక్రమాలు చాలావరకు ఒకేరకంగా వుంటాయి. కాని ఒక్క నమూనాలో వుండవు. అమెరికా పౌరసత్వానికి గానీ, ప్రపంచ పౌరసత్వానికిగానీ, అంతేకాక వ్యక్తి సుఖానికిగానీ మంచి ఆరోగ్యం ప్రధానలక్షణంగా పరిగణింపబడటంవల్ల చాలా పాఠశాలలు అప్పుడప్పుడు పిల్లలకు వైద్యపరీక్ష ఏర్పాటుచేస్తారు. ఏవైనా జబ్బులుంటే నయంచేసుకొనే ఏర్పాట్లుచేస్తారు. వారిఆరోగ్యపు క్రమాభివృద్ధిని పరిశీలించటం, శారీరక పరిశ్రమ, ప్రతిదినం ఆరోగ్య పరీక్ష-ఉంటాయి. ఇప్పటి పిల్లలు చదవటం వ్రాయటం లెక్కగట్టటం సాధ్యమైనంత బాగా నేర్చుకొనటం కూడా ప్రధానం కాబట్టి, సాధారణంగా పాఠశాలలన్నీ తెలివితేటలు పెంపొందించటంలో చాలా శ్రద్ధ వహిస్తాయి. అమెరికా ప్రపంచ చరిత్రలు, భూగోళశాస్త్రం, ప్రాథమిక విజ్ఞాన శాస్త్రం, మొదలైనవి పిల్లలందరూ చదవాలి. సంగీతం చిత్రకళ తదితర సృజనాత్మక కార్యక్రమాలలో పిల్లలంతా పాల్గొనటానికి కొన్ని అవకాశా లుంటాయి.

అన్ని పాఠశాలలలోనూ కనిపించే ఈ సామ్యం మన సామాన్య లక్ష్యాలఫలితం అనేది స్పష్టం. మనప్రభుత్వ పాఠశాలలు ప్రభుత్వంక్రింద స్థానిక సంస్థలక్రింద నడుపబడే సంప్రదాయం ఫలితంగా కొంత వైవిధ్యం కొంతవైషమ్యం ఏర్పడింది. ఆయా మండలాలలో పిల్లల అవసరాల కనుగుణంగా పాఠశాలలు పనిచేయాలనే ప్రయత్నంవల్ల ఆయా మండలాలలో

భిన్న భిన్నమైన ఆచారాలు తలెత్తుతాయి. ఈ సమన్వయంవల్ల బిడ్డలకు తగువిధంగా అధికసేవ చేయవలెననే ప్రయత్నంవల్ల పాఠశాలా కార్య క్రమాల్లో కొన్ని మార్పులూ వ్యత్యాసాలూ ఏర్పడతాయి.

## పాఠ్యక్రమం - ప్రణాళిక :

ప్రాథమిక పాఠశాలల్లో పాఠ్యక్రమమూ ప్రణాళికా ఎలా నిర్ణ యింప బడతాయి? చాలా రాష్ట్రాలలో ప్రభుత్వ విద్యాశాఖవారే ప్రాథ మిక పాఠశాలలకూ ఉన్నత పాఠశాలలకూ పాఠ్యక్రమాన్ని సిద్ధంచేసి, తమంతట తాము పాఠ్యప్రణాళికను తయారుచేసుకొని స్థానిక విద్యాసంస్థ లకు అందజేస్తారు. ఇందుకుగాను కొన్ని రాష్ట్రీయ విద్యాశాఖలవారు కొందరు విద్యావేత్తలను నియమించారు. పాఠ్యప్రణాళికా పరిశోధక శాలలు బోధనోపకరణ శాలలు ఏర్పాటుచేసారు. ఇలాంటి నగరపాఠ శాలలలోనూ కళాశాలలలోనూ విశ్వ విద్యాలయాలలోనూ ఉన్న పాఠ్య ప్రణాళికా పరిశోధన శాలలు ప్రణాళికా సంఘాలకు కార్యస్థానాలుగా ఉప యోగిస్తాయి. తమ పాఠశాలా కార్యక్రమాలను వృద్ధిపరచుకోగోరే విద్యా సంస్థలకు తగిన సాధనాలనూ నాయకత్వాన్ని సహాయాన్నీ ఇవి అంద జేస్తాయి, పెక్కుసందర్భాలలో సంపూర్ణమైన సిద్ధాంత జ్ఞానం, లేక, బోధనా సూచనలు - పాఠ్యప్రణాళికా మార్గదర్శినిలో స్పష్టమైన పాఠ్య ప్రణాళికకు బదులుగా - వుంటాయి. వీటిని స్థానికావసరాలకు అనుగు ణంగా సరిపెట్టుకోవచ్చు.

చాలాభాగం పెద్దపట్టణ పాఠశాలా సంస్థలూ, చాలా చిన్న చిన్న సంస్థలూ తమ తమ పాఠ్యక్రమాలను నిర్ణయించుకొంటాయి. కొన్ని సందర్భాలలో ఉపాధ్యాయులు పాఠశాలా పరిశీలకులు నిర్వాహకులు పరి శోధనా దర్శకులు తల్లిదండ్రులు, మరికొన్ని సందర్భాలలో పిల్లలు కూడా కలిసిమెలసి పాఠ్యప్రణాళికను రూపొందించుకొంటారు. ఈ ప్రజా స్వామికాచరణ చాలా కాలహరణం చేసేదే అయినా, పెక్కుదృక్కో

జాలను సమన్వయం చేస్తూ ఆయా వర్గాలవారికి విషయ పరిజ్ఞానం కల్గిం చటంవల్ల సత్ఫలితాలనే కలిగిస్తుంది. పిల్లల అవసరాల కనుగుణంగా పాఠశాలల కార్యక్రమాలను నిర్ణయించటానికి తరచుగా స్థానిక పరిశీల నలు జరుపబడుతాయి.

సంయుక్త రాష్ట్రాల్లో అంతటా ఇంతకుముందు చెప్పబడిన సహ కార ప్రణాళికా విధానం ద్వారాను బిడ్డల పెంపు, అభివృద్ధి, పరిశోధనల ద్వారాను స్థానికంగా ఉంచే వైద్యశాలలు గ్రంథాలయాలు ఉద్యానవనాలు ఆట స్థలాలు వస్తు ప్రదర్శన శాలలు మున్నగునవి విస్తృతంగా వినియో గించుకొనటం ద్వారాను బోధనా పద్ధతులలో నూతన్న ప్రయోగ పరిశోధ నల ద్వారాను ఇంకా అనేక విధాల పాఠశాలా కార్యక్రమాలు పెంపొం దింప బడుతున్నాయి. ఉపాధ్యాయుల శిక్షణకు సౌకర్యాలను పాఠ్యప్రణా ళికను నానాటికీ పెంపొందిస్తున్నారు. విజ్ఞానదాయకమైన వర్తమాన విద్యా విషయక సాహిత్యంకూడా నూతన విద్యాలక్ష్యాలను అర్థంచేసుకోటానికి, వాటిని ఆచరణలో పెట్టటానికి ఉపాధ్యాయులకు తోడ్పడుతున్నది.

ముద్రిత పాఠ్యప్రణాళిక ఎక్కడ ఎలా తయారుచేయబడుతున్న ప్పటికీ అది పిల్లలకోసం ఆచరణలోకి వచ్చే మార్గాలలో భేదం వున్నది. పిల్లలు బడిలోనూ బయటా పొందే అనుభవాలు ఆధారంగా వారికి బోధించటంలోనూ వారి కవసరమైన విజ్ఞానాన్ని ఇచ్చి కళానైపుణ్యం ప్రదర్శించటంలోనూ తమసమస్యలను తాము పరిష్కరించుకొని వ్యక్తులు గానూ వర్గాలుగానూ ప్రవర్తించటానికి వారికి సహాయపడటంలోనూ కొంతమంది ఉపాధ్యాయులు కృతకృత్యులైనారు. ఇలా సహాయపడ టంలో ఉపాధ్యాయులు ఇప్పటి అనుభవాలకు అనుగుణంగా నూతన విజ్ఞానాన్ని బోధిస్తారు. ఒక పాఠ్యభాగానికీ మరొక దానికీగల అత్యంత మైన సంబంధాన్ని బోధిస్తారు.

కొందరు ఉపాధ్యాయులు వివిధ పాఠ్యభాగాలకు రోజులో కొంత కాలాన్ని ప్రత్యేకించి వాటిని వేర్వేరుగా జీవితానుభవానికీ విజ్ఞానానికీ గల సంబంధాన్ని తెలియజేయటానికి గానీ వివిధ పాఠ్యభాగాలకూ మధ్యగల సంబంధాన్ని తెలియజేయటానికిగానీ ఏమాత్రం కృషిచేయకుండా బోధిస్తున్నారు. చాలామంది ఉపాధ్యాయుల బోధనావిధానం ఈ రెండు విరుద్ధ పద్ధతుల మధ్య వుంటుంది. కొన్ని సందర్భాలలో ఉపాధ్యాయులు తాము బోధించే విషయాన్ని సమన్వయించి చూపుతారు. కొన్ని సందర్భాలలో పిల్లల గ్రహణశక్తి సమర్థత పెరిగేందుకు వీలుగా ఆయా పాఠ్యభాగాలను కళలను సూటిగా బోధిస్తారు.

చాలా పాఠశాలల్లో అత్యధికభాగం ప్రతి బాలుని అభివృద్ధి విషయం లోను శ్రద్ధ తీసుకోబడుతుంది. ఒక పిల్లవాడు ఏదైనా నేర్చుకోవాలని ఎప్పుడు సిద్ధంగా వుంటాడో, అతనిని ఉత్తేజపరచి ఆసక్తి కలిగించి శక్తివంతంగా అతనికి ఎప్పుడు ఏది బోధించవచ్చునో పరిశీలించి నిశ్చయించటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

రికార్డులు - సలహా : అన్నిపాఠశాలల్లో కాకపోయినా, కొన్నింటిలో పిల్లవాడు బడిలో చేరినది మొదలు ఆయేటి కాయేడు క్రమక్రమంగా వాడు ఎలా పైకి వస్తున్నదీ తెలిపే రికార్డులు వ్రాయబడి వుంటాయి. ఉపాధ్యాయుడు అచిర్మప్రాయంగా వ్యక్తిగత సమర్థతలలోనూ, పిల్లల అభిలాషలలోనూ నేర్పులలోనూ, వారి గృహ సామాజిక జీవితంలోనూ గల విభేదాలను గుర్తించి, వారి అభివృద్ధికి అవసరమైన దారి చూపుతాడు. పిల్లవాని అభివృద్ధి చరిత్ర అతని పురోగమనసాధనాలు వ్యక్తిగత స్వభావాలు అవసరాలు - ఇవి పాఠశాల శాశ్వత రికార్డులలో ఒక భాగంగా వుంటాయి. విద్యార్థి తక్కిన పాఠశాలా కాలాన్ని ఎట్లు గడపవలెనో సలహా చెప్పటానికి ఇవే ప్రధానోపాధ్యాయునికి గానీ, ఉపాధ్యాయులకు గానీ, ప్రత్యేక సలహాదారులకుగానీ ఆధారంగా వుంటాయి. ఉపాధ్యా



అణుశాస్త్ర విద్యార్థి పరిశోధన

యుడు కూడా తల్లిదండ్రులకోసం అభివృద్ధి పట్టికలను తయారుచేస్తాడు. వ్యక్తిగత సంభాషణలవల్ల, వ్రాతపూర్వకమైన నివేదికలవల్ల తల్లిదండ్రుల ఉపాధ్యాయుల సమావేశాలవల్ల, పిల్లవాని అభివృద్ధికి దారి చూపటంలో ఆ యా కుటుంబాల సహాయాన్ని విద్యాలయం అర్థిస్తుంది.

పాఠశాలా దినం : పాఠశాలలలో ప్రతి ఒక్కదినం కార్యక్రమంలోను తగినంత వైవిధ్యం వుంటుంది. వయస్సుతో నిమిత్తం లేకుండా పిల్లవాడు వైయక్తికంగానూ సామాజికుడుగానూ తరగతిలోను నాటకశాలలోను క్రీడారంగంలోను అనుభవం గడిస్తాడు. విస్తృతమైన అభిలాషలు ప్రధాన కళాశీలతకూ, ఆత్మప్రకటనకూ, ఆత్మసంయమనానికీ

అవకాశం కలిగిస్తాయి. అభిలాషలు నైపుణ్యాలు తగిన జ్ఞానాన్ని సేకరించటానికి అమెరికా ప్రజాస్వామికానికి మూలమైన ఉత్తమ పౌరధర్మానికి రక్షకములైన ఆచారాలు అలవాట్లు పెంపొందించుకోటానికి తోడ్పడుతాయి.

కొన్ని పాఠశాలలలో దైనందిక కార్యక్రమాన్ని సిద్ధపరచటంలో విద్యార్థులు పాల్గొంటారు. ప్రతిదినం పిల్లవాడు పౌరాణికమైన నవీనమైన కథలు పద్యాలు చదివించుకొని ఆనందించే అవకాశం వుంటుంది. బహుశః ఇతరులు చదువుతుండగా అతడు వింటాడు లేదా తన ఆనందం కోసమూ ఆసక్తివల్లా తానే చదువుకొంటాడు. ఒక ఉపాధ్యాయుని ఆధ్వర్యంలోగానీ లేక ఒక సమాజాధ్యక్షుని ఆధ్వర్యంలోగానీ ప్రజలు కలసి మెలసి బ్రతికే విధమూ, ప్రపంచం నడిచే విధమూ, తరగతి గదులను నియమించే సమస్యనూ పాఠశాలలో ఆనాటి పని మూల్యాన్నీ విద్యార్థులు చర్చా సంఘాలలో చర్చిస్తారు. పిల్లవాడు తన భావాలను వ్యక్తపరిచేందుకు రంగులు గానీ రంగు బలపాలుగానీ తక్కిన చిత్రకళాసామగ్రి గానీ ఉపయోగించుకోవచ్చును. అతడు కొయ్యతోను తక్కిన పరికరాలతోను అతని కిష్టమైన బొమ్మరింటినో గ్రంథాలయాన్నో స్థానిక జీవితచిత్రాన్నో రైలు స్టేషన్నో నిర్మించుకోవచ్చు. పాఠశాలా కార్యక్రమం పరిణామశీలంగా వుండి, అవసరాని కనుగుణంగా మార్చుకోదగినదిగా వుంటుంది. చదువూ లెక్కలు వ్రాత ఆట సృజనాత్మక కృషి సవిమర్శక వివరణ - మొదలైన తెలివితేటలను అభివృద్ధి చేసుకొనేందుకు అవకాశం కల్పించబడుతుంది. చాలా పాఠశాలలలో వినోదాలు ఆటలు మొదలైనవి పాఠశాలా కార్యక్రమంలోగానీ పాఠశాలానంతర కార్యక్రమంలోగానీ భాగంగా ఏర్పాటుచేస్తారు. ఏ కార్యక్రమ మైనప్పటికీ పిల్లవాని సుఖస్థితి, అతని శక్తి సామర్థ్యాల పరిపూర్ణ వికాసము - ఈ రెండూ ప్రధాన లక్ష్యాలు.

# 11- ప్రాథమిక విద్యా వ్యాప్తి

వర్షాములు బడి వయస్సు ఆరేండ్లు. అంతకు లోబడిన పిల్లలకు అత్యవసరంగా శిశుశాలలను నిర్వహించవలసిన ఆవశ్యకత గుర్తింపబడింది. శిశుశాలలయందలి ఆసక్తి, పిల్లల ఉత్తమాభివృద్ధికి అవి సేవ చేయటం 19 వ శతాబ్ది తుది పాతికేండ్లలోనే ప్రారంభమైంది. మొదట్లో ధనవంతుల పిల్లలకోసమూ, తర్వాత దూరదేశాలలో ఉద్యోగాలుచేసే వారి పిల్లలకోసమూ వ్యక్తిగత యాజమాన్యంక్రింద శిశుశాలలు నిర్మించబడ్డాయి. పిల్లలు ఎలా పెరిగి పెంపొందుతారో, ఎలాంటి పాఠశాలా కార్యక్రమం వారి అభివృద్ధి అవసరాలకు దోహదం చేస్తుందో మున్నగు విషయాలమీద పరిశోధనలతో ఈ శిశుకేంద్ర కార్యక్రమం మన కెంతో మేలు చేకూర్చింది,

ఈనాడు ఒక్క రాష్ట్రం మినహా, తక్కిన అన్నిరాష్ట్రాలూ ఆ యా స్థానిక పాఠశాలలకు శిశు కేంద్రాలు ఏర్పాటు చేసేందుకు అధికారం ఇచ్చాయి. అయితే ఇందులో నిర్బంధం లేదు. రాష్ట్రాలలో మూడువంతులు స్థానిక పాఠశాలా నిధులకు సహాయకంగా ప్రభుత్వ ధనాన్ని ఇస్తున్నాయి. ఉచితమైన ప్రమాణాలను ఆచరణలో నెలకొల్పేందుకు, విద్యకు మూల కేంద్రమైన పాఠశాలలోని ఉపాధ్యాయులను ప్రోత్సహించేందుకు, చాలా రాష్ట్రాలు ఆదర్శగ్రంథాలను అందజేస్తున్నాయి. దానికితోడు చిన్న పిల్లల కోసం నడుపబడే శిశుశాలలకు ఆదర్శంగానూ ప్రమాణంగానూ చాలా రాష్ట్రాలు కొన్ని నిబంధనలను ఏర్పరిచాయి. చాలా రాష్ట్రాలు తమ ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులలో ఒకరిని వైయక్తిక పాఠశాలలను సందర్శించి ఆమోదించటానికిగాను ప్రత్యేకంగా నియమించాయి.

ప్రభుత్వ విద్యాచరిత్రలో ఇప్పుడు శిశుకేంద్రాలలో చేరిన పిల్లల సంఖ్య అత్యధికంగా వున్నది. సుమారు 10 లక్షల మంది ప్రభుత్వ పాఠశాలా శిశుకేంద్రాలలోనూ, వారిలో సగం వైయక్తిక శిశుకేంద్రాల్లోనూ

చేరి వున్నారు. చాలాచోట్ల శిశుకేంద్రాల విద్య, ప్రాథమిక పాఠశాలలోని మొదటి మూడేండ్ల విద్య కలిసి ప్రాథమిక పాఠశాలలో ప్రథమభాగంగా పరిగణింప బడుతున్నది. చాలా పాఠశాలలలో 5 ఏండ్ల లోపు పిల్లల కోసం శిశుశాలలు నిర్వహింప బడుతున్నాయి. ప్రాథమిక తరగతులకు పాఠ్యక్రమం మామూలు శిశుకేంద్రాలతో ఆరంభమై పిల్లల తెలివి తేటలను, విజ్ఞానాన్ని, సామాజిక సామరస్యాన్ని బట్టి 6–8 తరగతుల దాకా విస్తరించి ఉంది.

చాలా శిశుకేంద్రాలలో ప్రాథమికపాఠశాల పనిచేసే కాలంలో సగం మాత్రమే పిల్లలు హాజరుకావాలి. కాని పారిశ్రామిక ప్రదేశాలలోను జన సమ్మర్దంగల తావులలోను గల పాఠశాలలలోను కొన్ని పట్టణాలలోను పూర్తికాలం బడి వుంటుంది.

ఆరేండ్ల లోపు పిల్లలకు (1) తక్కినవారితో కలసి మెలసి వుండటం, (2) సురక్షిత పరిసరాలలో తమ కవసరమైన వృత్తి సంపాదించటం, (3) పరిశోధనల యెంపలి వారి ఆతృతను ఆసక్తిని బాధ్యతాజ్ఞానాన్ని నిర్ణయశక్తిని ప్రోత్సహించటం, (4) వారి విజ్ఞానాన్ని పెంపొందించటం; (5) వారు సంపూర్ణారోగ్యం పొందటం ముఖ్యంగా వారి కవసరమైన అనుభవాన్ని వారికి సమకూర్చటం కోసమే ఈ కార్యక్రమం రూపొందించబడింది. ఈ శిశుకేంద్రాలలో పిల్లలు కలిసి ఆడుకోటానికీ, అభినయించటానికీ, రంగులద్వారాను చెక్కతోను ఇసుకమీద మట్టితోను తక్కిన ప్లాస్టిక్ పరికరాలతోను తమ భావాలను బొమ్మలుగా రూపొందించటానికీ. నృత్యానికీ, అవకాశం వుంటుంది. వారు బడి బయటకూడా ఆడుకొంటారు. ఉపాధ్యాయులతో కలసి పరిసర ప్రాంతాలకు విజ్ఞానయాత్రలు పోతారు. అంతేకాక ఒంటరిగా కూర్చొని ఆ యా వస్తువులను చూచి ఆనందించటానికీ, తమకిష్టమైన ఒక పుస్తకాన్ని పర్యాలోకించటానికీ, కథలూ ఇతర సంగతులూ వినటానికీ, విశ్రాంతి

కోసమో వినోదానికో ఒకక్షణం కన్నుమూయటానికీ అవకాశం వుంటుంది.

ఉపాధ్యాయులు తల్లిదండ్రులు పాఠశాలాధికారులు - పిల్లలు శాస్త్రీయంగా ఎలా వృద్ధి పొందగలరో తెలిసికోవాలని ఆలోచిస్తూ వుంటారు. కాబట్టి ఈ పసిపాపలకు జీవితంలో చక్కని బాటచూపే విధంగా కార్యక్రమం ఏర్పరచటంకోసం మిక్కిలి కృషి జరుగుతున్నది.

## 12- ప్రాథమిక విద్యలో కొన్ని ధోరణులు

సంయుక్త రాష్ట్రములలో అంతటా ప్రాథమిక విద్యనుగురించి సాధారణీకరణం చేయటం చాలా కష్టం. అయినా ఆయా పాఠశాలల ఆచరణలోని వైవిధ్యం మధ్య ఒక పరిశీలకునకు ఈ క్రింది ధోరణులు, లేదా సంప్రదాయాలు కన్పిస్తాయి.

1. అభివృద్ధిని వ్యక్తిత్వం దృష్ట్యాను పాఠ్యాంశం దృష్ట్యాను విలువగట్టటం.

2. అధ్యాపకత్వాన్ని సాధ్యమైనంత వ్యక్తిగతం చేయటం.

3. శిశువృద్ధి పరిశోధనా ఫలితాలను పాఠ్యప్రణాళికా నిర్మాణంలోనూ, పిల్లలకు ఆయా దోహదాలు కల్పించటంలోనూ వినియోగించుకొనటం.

4. పిల్లలు నివసిస్తున్న సమాజాన్ని బట్టి వారి అవసరాలకు అనుగుణంగా విద్యా ప్రణాళికను సమన్వయించటం.

5. పిల్లల అభిలాషలను బట్టి వారి ఊహలలోని సమస్యల ననుసరించి పాఠశాలా కార్యక్రమాన్ని నిర్ణయించి నిర్వహించటం,

6. పాఠశాలను సమాజంలోను, సమాజాన్ని పాఠశాలలోను అన్ని విధాలా ప్రధాన భాగంగాచేయటం. తల్లిదండ్రులు పాఠశాలను సంద

ర్శించి దానికి సహాయకులుగా వుండి. ఆ యా పాఠశాలా సంఘాల్లో పని చేయటంలో, సామాజిక సంపదను పాఠశాలకు వినియోగించటంలో, సమాజావసరాలకు అనుగుణంగా పాఠశాలా భవనాలనూ స్థలాలను ఏర్పాటుచేసి వినియోగించటంలోను ఇది ప్రదర్శితమవుతుంది,

7. ప్రభుత్వ పాఠశాలా కార్యక్రమాన్ని (1) ఆరేండ్లలోపు పిల్లలకు. (2) బడిగంటల తర్వాతనూ, (3) బడిసెలవు నెలలలోనూ విస్తరింపజేయటం.

# 13- ఉన్నతవిద్య

ఉన్నత పాఠశాలలు చాలావరకు ప్రాథమిక పాఠశాలల విషయంలో చెప్పబడిన లక్ష్యాలనే కలిగివుంటాయి; కాని పిల్లలకు వయస్సు వచ్చిన తరువాత ఆ వయస్సును బట్టి మారే వారి అభిరుచులకూ అవసరాలకూ అనుగుణంగా పనిచేస్తాయి.

## ప్రభుత్వ ఉన్నత పాఠశాలల అభివృద్ధి :

గడచిన అర్ధశతాబ్దిలో ప్రభుత్వోన్నత పాఠశాలల సంఖ్య వేగిరం పెరగటానికి సాంఘిక ఆర్థిక పరిణామాలు దోహదం చేసాయి. ఈనాడు మనుష్యుడు చేయవలసిన పనిలో 85% యంత్రాలే చేస్తున్నాయి. అందువల్ల పిల్లలు పనిచేయనవసరంలేదు. స్వేచ్ఛగా బడికివెళ్ళి చదువుకోవచ్చు. బడిపిల్లలసంఖ్య పెరగటానికి నిర్బంధంగా పాఠశాలలో హాజరు కావలసిన వయః పరిమితి పెంచటం కూడా మరొక కారణం. అన్నిటికంటె ప్రధాన కారణం ప్రజాస్వామికాదర్శం. అమెరికా ప్రజలు తమ బిడ్డలకు నానాటికీ మరింత విద్య కావాలని కోరేటట్లు చేసిన ఆదర్శమే అది. ఇప్పుడు గడచిన నాలుగేండ్లలో ప్రభుత్వోన్నత పాఠశాలలో గానీ, వైయక్తికోన్నత పాఠశాలల్లో గానీ 14-17 సంవత్సరాల నడిమి పిల్లలు

నూటికి 70 మంది ఉన్నారు. 1900 సంవత్సరంలో బడిపిల్లలు 8.4% అంటే దాదాపు 5 లక్షలమంది ఇప్పుడు దాదాపు 60 లక్షలమంది చదువు తున్నారు. మాధ్యమికోన్నత పాఠశాలల పిల్లలను కూడా కలుపుకుంటే ఈ సంఖ్య 70 లక్షలకు మించుతుంది.

## సమస్యలు :

ప్రభుత్వ పాఠశాలల్లో విద్యార్థులసంఖ్య పెరిగినకొద్దీ పెద్ద పెద్ద సమస్యలు పుట్టుకొస్తున్నాయి, ఇప్పుడు విద్యా కార్యక్రమం ప్రత్యేకంగా ఏ కొద్దిమందికో కాదు. వివిధములైన శక్తి సామర్థ్యాలు, అభిరుచులు గల విద్యార్థులకు ఆ కార్యక్రమం యోగ్యంగా వుండాలి. అది కళాశాలలకు వృత్తి పాఠశాలలకు పోయే విద్యార్థులకు మాత్రమేగాక, ఉన్నత విద్య తోనే వర్తక వ్యాపారాలలోకి, తక్కిన జీవితవృత్తులలోకి పోయేవారికి కూడా అనుకూలంగా వుండాలి. సామాన్యవిద్య ఉన్నత పాఠశాలతోనే చాలామంది విద్యార్థులకు సమాప్తమవుతుంది. ఈ అంశం మనస్సులో ఉంచుకొని ఆ విద్యావిధానం విద్యార్థుల పూర్తి అవసరాలకు సాధ్యమై నంత సమగ్రంగా వుండాలి.

## విద్యాకార్యక్రమం :

పాఠశాల తన బాధ్యతలను గుర్తించటంలో ఒక విస్తృత కార్య విధానాన్ని అనుసరించాలి. ఇటీవల ఒక విద్యాశాఖా కార్యాలయంవారు తీసిన లెక్కలప్రకారం అమెరికా ప్రభుత్వోన్నత పాఠశాలలలో మొత్తం 274 వివిధ పాఠ్యాంశాలు బోధింపబడుతున్నట్లు లెక్క తేల్చబడింది. ఒకేరకం పాఠ్యాంశాలను ఒక్కటిగా లెక్కించిన మీదట తేలినసంఖ్యయే ఇది. దుకాణాలలోను, వడ్రంగం అచ్చుపని కుటీర పరిశ్రమలు - మొద లైన కార్ఖానాలలోను, వ్యవసాయ వ్యాపార రంగాలలోను, ప్రత్యక్షాను భవం కలిగించాలంటే నూతనబోధనా పద్ధతులను అనుసరించి తీరాలి.

ఉన్నత పాఠశాలా విద్యార్థులకు బ్రతుకుతెరువు నేర్పటం ఇందులో ఒక అంశం. ఏండ్లతరబడిగా పరిపాలకులూ ఉపాధ్యాయులూ తల్లిదండ్రులూ పిల్లలకు విద్యవలన ప్రయోజనాలన్నీ సంపూర్ణంగా సమకూర్చాలని గుర్తించి వున్నారు.

## జీవితాను గుణమైన విద్య :

ఉదాహరణకు జీవితానుగుణమైన విద్యనుగూర్చి విచారిద్దాం. అన్ని పాఠశాలలూ సమాజాలూ తమ ఉన్నత విద్యా విధానాన్ని పరిశీలించి దానిని తగినట్లు రూపొందించటానికై ఏమేమి మార్పులు చేయాలో నిర్ణయించటానికి దోహదం చేయటమే ఈ ఉద్యమంయొక్క ఉద్దేశ్యం. ఒక్కసారి ఆ సమస్యలు తెలుసుకుంటే వాటిని పరిష్కరించే మార్గాలు కనుగొనవచ్చు. ఉన్నత పాఠశాలా విద్యార్థులు ఈ క్రిందిఫలితాలను పొందగలరని విద్యావేత్తల అభిప్రాయం :

1. ప్రాథమిక విజ్ఞాన సాధనాలను పొందటం.

2. శాస్త్రీయ పద్ధతులనూ వాని విశిష్టతనూ అర్థం చేసుకొనటం.

3. ఒకవృత్తి చేయటానికి తయారై, ఆ వృత్తి సంపాదించి, పనిచేయటం.

4. చక్కని మానసికారోగ్యాన్నీ శరీరపాటవాన్నీ పెంపొందించుకొని, వాటిని కాపాడుకొనటం.

5. చక్కని వినియోగదారు కావటం.

6. నైతిక విలువలయందు సూత్రాలయందు అంతర్ముఖత్వం అలవరచుకోవటం.

7. లలితకళల యందలి, ప్రకృతి యందలి సౌందర్యానుభూతి పెంపొందించుకొనటం.

8. మంచి పౌరుడు కావటం.

9. మంచి కుటుంబ సభ్యుడు కావటం.

IV. విశ్రాంత సమయాన్ని తెలివిగా వినియోగించుకొనటం.

ఇది అనేక సమస్యలతో కూడిన అద్భుతమైన కార్యం అనేది స్పష్టం. పాఠశాలకు కావలసిన పాఠ్యప్రణాళికను కూర్చుకొని తరగతుల వారీగా సమకూర్చుకోవాలి. విద్యార్థుల అవసరాలకు బోధనాపద్ధతులను అనుసంధించుకోవాలి. తగిన భవనాలనూ బోధనా సౌకర్యాలనూ సమకూర్చుకొని జాతీయాభిరుచులను పురికొల్పాలి. ఏ రెండు రాష్ట్రాలుగానీ పట్టణాలుగానీ జాతులుగానీ ఈ సమస్యలను ఒకేవిధంగా పరిష్కరింపవు. విద్య ఎలా వుండాలనే విషయంలో ఏ కేంద్ర కార్యాలయం గానీ ఒక నిర్ణీత విధానాన్ని శాసింపదు.

## పాఠ్య ప్రణాళిక :

సాధారణంగా ఇంగ్లీషు సామాజిక విజ్ఞానం, లెక్కలు, సామాన్య శాస్త్రం, శరీరపరిశ్రమ అనే అంశాలు వుంటాయి. కొన్ని పాఠశాలలలో పైన చెప్పబడిన రెండు మూడంశాల ఆవరణలోని ఆయా విషయాల కలగలుపులూ చిన్న చిన్న మార్పులూ వుంటాయి. వీటికితోడు లలితకళలలో గానీ, తక్కిన పనిపాటల్లోగానీ ఏవో కొన్ని ఇతర విద్యలను ఎన్నుకోవాలి. ఉన్నతవిద్య కొనసాగుతున్నకొద్దీ ఇన్ని పాఠ్యాంశాలూ నాలుగు ప్రధానాంశాలకు తగ్గింపబడతాయి. విద్యార్థులు కోరుకానే అంశాలకు ఎక్కువ అవకాశం కల్పింపబడుతుంది. మామూలుగా ఒక విద్యార్థి యొక్క కాలం ఈ క్రింది విధంగా వినియోగింపబడుతుంది. అతని మొత్తం కాలంలో నాల్గవ వంతు భాషకూ వ్యవహారానికి ప్రత్యేకింపబడుతుంది. ఇంకా చాలాభాగం ప్రపంచ చరిత్ర అమెరికా చరిత్ర ప్రభుత్వ సమస్యలు మున్నగు సాంఘిక విజ్ఞానానికి వినియోగింపబడుతుంది. ఉన్నత విద్య తొలిదశలలో ప్రతి విద్యార్థీ గణితమో సామాన్య శాస్త్రమో అభ్యసించాలి. ఆ తర్వాత ఈ రంగాలలో అతడు ప్రత్యేక శిక్షణ పొందవచ్చును. శరీరపరిశ్రమ, ఆరోగ్యం ఇవి తప్పనిసరి. విదేశభాషలూ,

లలితకళలూ, వివిధ వృత్తిపనులూ - ఇవన్నీ దాదాపు ఐచ్ఛికాలే. కొద్ది రంగాలలో సక్రమమైన కృషి జరిగేందుకు విద్యార్థియే తన కిష్టమైన అంశాలను ఎంచుకోవాలి.

కేంద్రీకృతమైన కృషికోసం పాఠశాల మామూలుగా విద్యార్థులకు అవకాశం ఇస్తుంది. ఎక్కువభాగం పాఠశాలలో కళాశాలోచితమైన, వ్యాపారసంబంధమైన, వృత్తిసంబంధమైన, లేక - సాధారణమైన పాఠ్య ప్రణాళికను విద్యార్థియే ఎంచుకోవచ్చు. అతడే మామూలుగా తక్కిన పాఠ్యవిషయాలను ఎన్నుకోవచ్చు. కాని అది పైని కోరుకొన్న విద్యకు అనుబంధంగా వుండాలి.

సమన్వితి :

వివిధమైన ఉన్నత విద్యాంశాలు ఒకే విభాగంలో కొద్దికొద్దిమందికి నేర్పబడుతాయి. పెద్ద పెద్ద పట్నాలలో కూడా ఈ రకం ఏర్పాటే ముఖ్యంగా వుంది. కొన్ని కొన్ని పెద్ద పట్టణాలలో రకరకాల సాధారణ విద్యకూ వృత్తి విద్యకూ ప్రత్యేకమైన ఉన్నత పాఠశాల లున్నాయి. ఇప్ప టికీ విద్యార్థిని కళాశాలకు తయారుచేసి, వృత్తివిద్యను సాధారణ విద్యనూ మామూలు ఉన్నత పాఠశాల విద్యార్థికి అందజేస్తుంది. ఈ విధంగా కళా శాలా ప్రవేశయోగ్యత కల్పించే పాఠ్యక్రమంలోనూ, వృత్తివిద్యలను నేర్పే పాఠ్య క్రమంలోనూ మామూలు విద్యాప్రణాళిక కంటె ఎంతో అభ్యు దయం సాధింపబడినది. ఈ చివరి అంశంలో ఎక్కువ శ్రద్ధ చూపబడు తున్నది.

తరగతి పనితోపాటు తక్కిన పనులుకూడా విద్యార్థి అభివృద్ధికి తోడ్పడటంవల్ల విద్యార్థులు బయటి కార్యక్రమాలలో తప్పనిసరిగా పాల్గొంటారు. ఇందులో వారి వారి అభిలాషలకు ఎక్కువ అవకాశం వుంది. వారు వాయిద్యాలను నేర్చుకోవచ్చు, సంగీతం నేర్చుకోవచ్చు, సారస్వతసంఘాల్లోగానీ, చర్చా సంఘంలోగానీ చేరవచ్చు, నాటకా లాడ



కర్మాగారంలో......

వచ్చు, ఆటల పోటీలలో పాల్గొనవచ్చు, ఆ తరగతిగానీ పాఠశాలగానీ ప్రచురించే పత్రికలూ మొదలైన ప్రచురణలలో పనిచేయవచ్చు. ఇందులో కళాకారులూ రచయితలూ ఆటగాండ్రూ బహువిధాల పోటీచేయవచ్చు. సాధారణంగా పిల్లలు పాల్గొనటానికి సాంఘిక ఔత్సాహిక కూటములు, వినోదశాలలు పాఠశాలలో బోధించే వివిధాంశాల తాలూకు కూటములు వుంటాయి. కొన్ని పాఠశాలల్లో తరగతి పనులకూ, బయటి కార్యక్రమాలకూ పెద్ద తేడావుండదు. మామూలు తరగతివిద్యకే అధిక ప్రాధాన్యం ఇచ్చే పాఠశాలల్లోకూడా బయటి కార్యక్రమాలకు గొప్ప స్థానం వుంది.

ఉన్నత పాఠశాలల్లో విద్యార్థుల సంఖ్య పెరగటంవల్ల వారి వారి వివిధాభి రుచులకూ, అవసరాలకూ తగినట్లుగా విద్యను రూపొందించటం కోసం రకరకాల విస్తృతపాఠశాలేతర కార్యక్రమాలు కల్పింపబడ్డాయి.

# 14- వృత్తి విద్య

ఆశయములు :

సంయుక్త రాష్ట్రాలలోని ప్రభుత్వ పాఠశాలా విధానంలో వృత్తి విద్య ఒక ప్రధానాంగంగా ఉన్నది. ప్రజలను ఉపయోగకరమైన వృత్తులకు సిద్ధంచేయటమే దీని ముఖ్యోద్దేశం. వివిధ పాఠశాలలద్వారా తరగతులద్వారా ప్రజలు తమకు తెలివితేటలను విజ్ఞానాన్ని గ్రహణశక్తిని పనిచేసే అలవాట్లను మంచి లక్షణాలను నేర్చుకోటానికి తగిన శిక్షణ ఈయబడుతున్నది. దీనివలనవారు తెలివితేటలుగలిగి సమర్థులైన పనివారు కాగలరు. ఈ వృత్తివిద్య తక్కిన రకాలైన విద్యకు ప్రత్యామ్నాయంగా కాక, సహాయకంగా నేర్పబడుతున్నది. విద్యకూ పౌరసత్వానికీ సాంస్కృతికాభివృద్ధికీ ఆరోగ్యపోషణకూ వృత్తికీ తక్కినవారితో కలసి మెలసి పనిచేయటానికీ ప్రతి ఒక్కనికీ అవకాశం ఉంది. అంతేకాక అతడు కోరుకొన్న వృత్తిలో అతణ్ణి సమర్థునిగా చేయు శిక్షణకుకూడా అవకాశం వుంది.

వృత్తివిద్య బడివయస్సు పిల్లలకు మాత్రమే పరిమితంకాదు. 14 ఏండ్లుదాటి ఏదో ఒక వృత్తికోసం వెతుకుతున్నవారికీ, లేదా, ఏదో ఒక వృత్తిలో ప్రవేశించినవారికీ వృత్తివిద్య అందజేయబడుతున్నది. వృత్తి విద్యా కార్యక్రమం వలన సామాన్యంగా రెండు తెగలవారికి మేలు కలుగుతున్నది. వీరిలో అధికసంఖ్యాకులు ఉన్నత పాఠశాలా విద్యార్థులు. వీరు ఏడాదికి తక్కువకాకుండా తమకాలంలో అధికభాగం ఉన్నత పాఠశాలలోగానీ సహకార కార్యక్రమాల్లోగానీ, వినియోగిస్తారు.

అక్కడ తమ జీవనోపాధి కవసరమగు విద్యను గ్రహిస్తారు. రెండవ తెగవారు పాఠశాల వదలి పనిపాటల్లో ప్రవేశించి ఆయా వృత్తుల్లో ఇంకా శిక్షణపొందటం కోసం కొద్దికాలంపాటు పాఠశాలలకు హాజరయ్యే వారు. ఈ రెండవ తెగవారు ఆయా ప్రత్యేకావసరాలకు అనుగుణాలైన వివిధ తరగతులద్వారా శిక్షణ పొందుతారు. ఇట్టి తరగతులు కొన్ని క్రొత్తగా పనిలో ప్రవేశించిన వారికోసం ఏర్పాటు చేయబడతాయి. వారు తమ పనికాలంలో కొన్నిగంటలు బడికివస్తారు. బడికాలంలో కాక సాయంత్రంగానీ తీరికసమయాల్లోగానీ వీరికై కొన్నితరగతు లుంటాయి. శిక్షణ పూర్తికాగానే ఉద్యోగాలు దొరికే వారికోసం కొన్ని ప్రత్యేక తరగతులు నడుపుతారు.

## శిక్షణ క్రమం

వృత్తి విద్యాప్రయోజనం ఆయా విద్యార్థులను ప్రయోజన కరము లైన వృత్తుల్లో సమర్థులనుగా తయారుచేయటమే కనుక ఆ యా వృత్తుల్లో వున్నవారికి ఎట్టిశిక్షణ అవసరమో అట్టిశిక్షణ నీయవలసిన అవసరంవుంది. ఆయా వృత్తులలోనానాటికీ వస్తున్నమార్పులకు అనుగుణంగా వృత్తివిద్యా విధానం పరిణామ శీలమైవుండాలి. మనఆర్థిక సాంఘిక జీవితాలలో కలిగిన అభివృద్ధికి అనుగుణంగా పనిముట్లలోను ఇతర పరికరాలలోను వస్తువుల లోను వ్యవసాయపు పనులలోను గృహకృత్యాలలోను వస్తుశాలలోను కర్మాగారాలలోను మార్పులు కలుగుతున్నాయి. దీన్నిబట్టి మనము నేర్పే వృత్తి విద్యలో కూడా మార్పులు రావలసి వున్నది. మనప్రజలు చేస్తున్న వృత్తులు ఎంత వివిధాలుగా ఎంత పరిణామ శీలాలుగా ఉన్నాయో, అంతగా వృత్తి పాఠశాలలు తరగతులు వైవిధ్యమూ పరిణామమూ కలిగి వున్నాయి.

## నిర్వహణ - అధికారం

తక్కిన విద్యావిధానంలో మాదిరిగానే వృత్తివిద్యా విధానంలో కేంద్రప్రభుత్వాధికారం లేదు. కేంద్రప్రభుత్వోద్యోగులకూ తక్కిన కొన్ని అల్పవర్గాలవారి అవసరాలకూ అనుగుణమైన శిక్షణ ఇయవలసిన ఏ కొలది సందర్భాలలోనో తప్ప కేంద్రం వృత్తి పాఠశాలలను ఏర్పరచటంగాని, నిర్వహించటంగాని లేదు. ప్రభుత్వవృత్తివిద్యా కార్యక్రమాలన్నీ ఆయా రాష్ట్రవృత్తి విద్యాసంఘాలయొక్క, ఆయా ప్రాంతపట్టణ విద్యాసంస్థల పాఠశాలాధికారులయొక్క పరిశీలన క్రిందనూ అధికారం క్రిందనూ నిర్వహింపబడుతున్నాయి. జాతీయ శ్రేయస్సుకు సుశిక్షితులైన పనివాండ్రు [illegible] వృత్తి విద్యాభివృద్ధికి ప్రత్యేకశ్రద్ధ వహించి, ఈ విషయంలో కేంద్రప్రభుత్వం [illegible] శాసనాలు చేసింది. అవి వృత్తివిద్యకు ఎంతగానో తోడ్పడ్డాయి. ప్రధానంగా ఆయారాష్ట్రాలలో జరుగుతున్న పనికి మార్గదర్శకాలైన 1917 నాటి స్మిత్‌హ్యూస్ చట్టమూ, 1946 నాటి జార్జిబార్డెన్ చట్టమూ అనే రెండు జాతీయ వృత్తి విద్యాచట్టాలు కూడా అమలులో ఉన్నాయి. ఈ రెండుచట్టాల సామాన్య ప్రయోజనం ఒక్కటే. కళాశాలా స్థాయికి తగ్గిన వృత్తి విద్యాభివృద్ధి విషయంలో అన్ని రాష్ట్రాలమధ్య సహకారం సాధించటం వీటి ప్రయోజనం. ఈ చట్టాలవల్ల సహకారాన్ని సాధించటంలో కేంద్రప్రభుత్వ పాత్ర రెండులక్షణాలను కలిగిఉన్నది. 1. వృత్తివిద్యా శిక్షణ కార్యక్రమాలకు అవసరాలైన ఆయా తరగతులను నిర్ణయించటం, 2. వృత్తి విద్యా కార్యక్రమాలను ఏర్పరచటానికి అయ్యే వ్యయంలో కొంతభాగం కేంద్రనిధులనుండి భరించి వాటికి సహాయపడటం.

## కేంద్రసహాయం

ఈ చట్టాల ప్రకారం వినిమయం చేయబడిన కేంద్రనిధులు ఆయా రాష్ట్రాలకు ప్రతియేటా పంచిపెట్టబడతాయి. ప్రతిరాష్ట్రంలోనూ ఒక

వృత్తివిద్యా సంఘంద్వారా ఆ నిధులు వినియోగింపబడతాయి. కేంద్ర నిధులు ఎంతమొత్తం వ్యయింపబడతాయో, సరిగ్గా అంతమొత్తం రాష్ట్రంగానీ ఆయా స్థానిక సంఘాలుగానీ ఖర్చుపెట్టవలసి వుంటుంది. కాని ఆచరణలో కేంద్రనిధుల కన్నా ఎక్కువగా రాష్ట్రప్రభుత్వాలూ స్థానికసంఘాలూ ఖర్చుపెడుతున్నాయి. అమెరికా సంయుక్త రాష్ట్రాల విద్యాశాఖ వారి వృత్తి విద్యావిభాగం సహకార కార్యవిధానం పట్ల శ్రద్ధవహిస్తుంది. దేశీయ వృత్తివిద్యా చట్టాలప్రకారం ప్రత్యేకింపబడి రాష్ట్రాలకు పంచబడే నిధులు సాధారణంగా వ్యవసాయం వ్యాపారం, గృహనిర్వహణ, చేతిపనులు-పరిశ్రమలు అనే నాలుగు రకాలైన వృత్తి

విద్యాశిక్షణను పెంపొందించటానికి వినియోగింపబడతాయి. ఈ ప్రత్యేక రంగాలలో ఈయబడే శిక్షణను గురించి మరింత స్పష్టంగా ఈ క్రింద వివరిస్తాను.

## అభివృద్ధి

మొట్టమొదటి కేంద్రవృత్తి విద్యాచట్టం 1917 లో శాసింపబడింది లగాయతు వివిధవృత్తి విద్యాతరగతులలో విద్యాసంఖ్య పెరగటాన్ని బట్టి ఆయా రాష్ట్రాలు ప్రభుత్వ వృత్తివిద్యా విధానానికి ఇచ్చిన ప్రాముఖ్యం స్పష్టపడుతుంది. పై నాల్గురకాలైన వృత్తివిద్యా రంగాలలో అన్నిరకాల తరగతుల సంఖ్యలు ఈ క్రిందిపట్టికను బట్టి తెలుసుకో వచ్చు.

| | | | |
|---|---|---|---|
| 1918 | .... | .... | 1,64,186 |
| 1923 | .... | .... | 5,36,528 |
| 1928 | .... | .... | 8,58,456 |
| 1933 | .... | .... | 10,34,110 |
| 1938 | .... | .... | 18,10,082 |
| 1943 | .... | .... | 22,81,743 |
| 1948 | .... | .... | 28,35,392 |
| 1950 | .... | .... | 33,63,684 |

## వ్యవసాయ విద్య

వ్యవసాయంలో వృత్తివిద్య కేంద్రప్రభుత్వ సహాయంతో దేశ మంతటా నిర్వహింపబడుతున్నది. రాష్ట్రీయవృత్తి విద్యాసంఘముల యొక్క. కేంద్రసంక్షేమ శాఖయొక్క సహకార కార్యక్రమంక్రింద వ్యవ సాయంలోను కళాశాలా స్థాయికంటె తక్కువైన వ్యవసాయక యంత్రాల విషయాల్లో సక్రమమైన శిక్షణ ఈయబడుతున్నది. (1) 14

ఏండ్లుదాటి వ్యవసాయకులు కాగోరి బడిలోచేరిన పూర్తికాలపు విద్యార్థుల కోసం, (2) బడివదలిపెట్టి వ్యవసాయ రంగంలో కుదురుకొంటూ శిక్షణకోరే యువకర్షకుల కోసం, (3) వ్యవసాయంచేస్తూ నూతన పద్ధతులు నేర్చుకోగోరే పెద్దలకోసం ఈ కార్యక్రమం ఉద్దేశింపబడింది.

## బోధనా కార్యక్రమం

కేంద్రవృత్తి విద్యాచట్టముల యందలి నిబంధనల ప్రకారం సక్రమవ్యవసాయ శిక్షణలో ప్రతి సందర్భంలోనూ పాఠశాలలో కానీ, వ్యవసాయ క్షేత్రంలో కానీ నిపుణుల పర్యవేక్షణక్రింద ఏడాదికి ఆరు నెలలు వ్యవసాయం చేయటంలో విద్యార్థికి ప్రత్యక్షానుభవం వుండాలి. వ్యవసాయ కళాశాలా పట్టభద్రులైన పూర్తికాలపు ఉపాధ్యాయులు ఈ శిక్షణనిస్తారు. తమ తమ సొంతపొలాలలో ఆయా విద్యార్థులు వ్యవసాయ కార్యక్రమం ఎలా సాగిస్తున్నారో పరిశీలించి, ఉపాధ్యాయులు వారికి తగినశిక్షణ నిస్తారు. వ్యవసాయ వృత్తిలో శిక్షణ అంటే కొంత కాలం బడిలోనూ కొంతకాలం వారి వారి పొలాల్లోను కొంత ఇతరుల పొలాలలోనూ ఈయబడుతుంది. విద్యార్థి 'పనిచేయటంవల్ల నేర్చుకొనే' ఒకానొక విద్యావిధానం అది. ఒకవిద్యార్థి ఉపాధ్యాయుల పర్యవేక్షణ క్రిందచేసిన వ్యవసాయానుభవానికి సంబంధించిన సమస్యలమీద, తన సొంతపొలం తాలూకు, ఆ ప్రాంతపు పొలాలతాలూకు సమస్యలమీద ఆధారపడి ఈ శిక్షణ వుంటుంది. ఇందులో పొలాల్లో పండింపబడే పంటలను గురించిన సమస్యలు, వాటి అమ్మకం, భూసారం, వ్యావసాయకావ కాశాలను గురించిన సమస్యలు, పంటను నిల్వచేసికొనటం మొదలైనవి ఇమిడివుంటాయి.

వ్యవసాయ తరగతులలో చేరిన పూర్తికాలపు విద్యార్థులు సాధారణ పాఠ్యాంశాలతో ఉన్నతవిద్యను కూడా అభ్యసింపవలసి వుంటుంది. కనుక వారికి పాఠశాలల్లో సామాన్యశిక్షణకూడా ఈయబడుతుంది. దీని

వల్ల నాలుగేళ్ళ శిక్షణ అనంతరం వారికి ఉన్నత పాఠశాలా యోగ్యత పత్రం ఈయబడుతుంది. ఆ తర్వాత వారు ఆ యా పాఠ్యాంశాలలో పట్ట భద్రులు కావటానికి కళాశాలల్లో గానీ విశ్వ విద్యాలయాల్లో గానీ ప్రవే శించవచ్చు. యువకర్షకుడు గానీ, మామూలు రైతుగానీ ఒక్క వ్యవ సాయ వృత్తిలో శిక్షణయే కాక సమగ్రమైన శిక్షణకు అవసరమైన తక్కిన పాఠ్యాంశాలను గూడా నేర్చుకోవచ్చు.

## పర్యవేక్షిత ప్రణాళికలు

వ్యవసాయక వృత్తివిద్యా తరగతులు గ్రామీణోన్నత పాఠశా లలో హాజరవుతున్న విద్యార్థులు ఉపాధ్యాయుల పర్యవేక్షణ క్రింద వ్యవ సాయాన్ని అభ్యసించటంవల్ల అమూల్యమైన పాఠాలు నేర్చుకొంటున్నా రనే విషయం రాష్ట్రీయ వృత్తివిద్య సంఘాలు సేకరించిన సంఖ్యలను బట్టి స్పష్టపడుతుంది. ఉపాధ్యాయ విద్యార్థులమధ్య సహకారంతో వ్యావ సాయక ప్రణాళికలు విద్యార్థి సొంతపొలంలోని సాగు పరిస్థితులకు తగిన వ్యవసాయక కృషి మీదనేకాక ఆ ప్రాంతపుపొలాలమీద కూడా ఆధార పడి వుంటాయి. అంతేకాక అవి దీర్ఘకాలిక పద్ధతిపైన విద్యార్థియొక్క శాశ్వతమైన వ్యవసాయకకార్యాలకు తగినట్లుగా యోజింపబడివుంటాయి. వ్యవసాయ విద్యార్థులు ఉపాధ్యాయుల పర్యవేక్షణక్రింద వ్యవసాయం చేయటంవల్ల వారు వారి వారి భూముల్లో శాస్త్రీయపద్ధతులపై పనిచేయ టమే కాక, ఆయా ప్రాంతీయ వ్యవసాయ క్షేత్రాలలో కూడా ఈ క్రొత్త పద్ధతులను ఆచరణలో పెట్టటానికి తోడ్పడటం కూడా జరుగుతుంది. ఉపాధ్యాయుల పర్యవేక్షణక్రింద తమ తమ పొలాలలో వ్యవసాయం చేయటంవల్ల విద్యార్థులు తర్వాత వ్యవసాయం ప్రారంభించి లాభసాటి యైన వ్యవసాయోత్పత్తి చేయటానికి కావలసినంత ధనం సంపాదించు కోవటం పరిపాటిగా వుంది.

పూర్తికాలపు విద్యార్థులకు యువకర్షకులకు మామూలు రైతులకు శిక్షణ తరగతులవల్ల కలిగిన లాభమేమిటో వ్యక్తిగతంగా ఆ విద్యార్థులు పొందిన ప్రయోజనాన్ని బట్టి తేటతెల్లమవుతుంది.

నిదర్శనాలు :- ఒక వ్యవసాయ వృత్తి విద్యాశాఖలో ఒక పూర్తి కాలపు విద్యార్థిని ఈ సందర్భంలో నిదర్శనంగా పేర్కొనవచ్చు. అతడు ఉపాధ్యాయుల సహాయంతోను, తండ్రి సహకారంతోను తన పొలం లోని వివిధ భూసారాలను పరీక్షించి వ్యవసాయక కృషి సాగించాడు. పండిన పంటలకు దేశంలో ఉన్న అవసరాన్ని, వాటిని అమ్ముకోవల సిన విధాన్నీ పరికించాడు. పై పరిశీలన వలన తేలిన సంగతులను ఆధారం చేసికొని పర్యవేక్షిత వ్యవసాయక కార్యక్రమం నిర్ణయింప బడింది. అందులో పందులను పెంచటం ఒక ప్రధాన కార్యక్రమం. దీన్ని ఒకపిల్లల పందితో ప్రారంభించాడు. ఈప్రణాళిక ఎంతలాభసాటి అయిం దంటే, ప్రతిసంవత్సరం ఆరేసి నెలలకు (పందుల సంఖ్యతో నిమిత్తం లేకుండా) 2,000 పౌన్ల బరువుగల పందిపిల్లల చొప్పున నాలుగేళ్ళ పాటు ఉత్పత్తి చేయగలిగాడు. ఆ పొలం పరిశీలనవల్ల ఆహారపు పంట వేయవచ్చునని తేలింది. అందువల్ల చౌకగా పండే ఆహారపు పంటను ఎన్నుకొని తన ప్రాంతంలోని భూసారాన్నీ శీతోష్ణ పరిస్థితులనూ గమ నించి రెండవ ప్రణాళికగా ప్రారంభించాడు. ఇంక తక్కిన వ్యాపా రాలు పందిమాంసం పశువులు గొఱ్ఱెలు వోటుధాన్యం గోధుమ - ఇవన్నీ ఆ విద్యార్థి ఉపాధ్యాయుని పర్యవేక్షణక్రింది వ్యవసాయ కార్యక్రమంలో ఒకభాగం మాత్రమే.

తర్వాత తన సొంతడబ్బుతో ఈ విద్యార్థి కొంతభూమిని కొని వ్యవసాయంలో తనతండ్రితో భాగంకలిసి ఇంకా ఎన్నో ఎకరాలు సాగు చేసాడు. శాస్త్రీయమైన అనుభవపూర్వకమైన తన వ్యవసాయ వృత్తి విద్యా శిక్షణ తన పొలంలోని సమాజక్షేత్రాలలోని వాస్తవపరిస్థితులమీద

ఆధారపడినదే కనుక ఈ విద్యార్థి తన వస్తువులను అమ్మే విపణి వీధు లలో పందులు మొదలైన వాని ఉత్పత్తి దారుగా గొప్పకీర్తి గడిం చాడు.

యువకర్షక వృత్తివిద్యా తరగతిలో మూడేండ్లపాటు శిక్షణ పొందిన మరొక విద్యార్థిని రెండవ నిదర్శనంగా చూపవచ్చు. శిక్షణ ఆరంభించే నాటికి ఈ యువకుడు తన తల్లిదండ్రుల దగ్గర ఉండేవాడు. క్రమక్రమంగా అతడువ్యవసాయ పరికరాలను పశువులను తక్కినవ్యావసా యకా వసరాలను సమకూర్చుకొన్నాడు, తనసొంత క్షేత్రంలో పనిచేయ టానికి తగిన పరిస్థితులు కల్పించుకొన్నాడు. తనవిద్య ఫలితంగా ఇతడు తన ఉపాధ్యాయుని పర్యవేక్షణక్రింది వ్యావసాయక కార్యక్రమంలో మిశ్ర జాతి ధాన్యాన్ని ఉత్పత్తిచేయబూనాడు. క్షేత్రనిర్వహణ తరగతిలో అతడు ఒకే వైశాల్యంగల పొలంలో వోట్లకంటె బార్లీ ఎక్కువ పండించవచ్చు నని తెలిసికొన్నాడు. దానితో తానువేసే పైర్లు మార్చాడు. తన పశుసంప దను సమకూర్చుకోడానికిగాను ముందు ఒకఆవుపెయ్యను సంపాదించాడు. అతడు తనవ్యవసాయ కార్యక్రమంలో సాధించిన అభివృద్ధి అంతా తాను యువకర్షక తరగతిలో పొందిన శిక్షణయొక్క ఫలిత మే అని అతడేచెప్పు కొన్నాడు. ఇతని విషయంలో విశేషమేమంటే, ఇతడు ఉన్నతపాఠశా లలో వ్యవసాయ శిక్షణపొందిన వాడుకాడు. ఎనిమిదవ తరగతిలోనే చదువు మానేసాడు. వృత్తివిద్యా తరగతులే లేకపోతే, ఇప్పుడు ఇతనిని విజయమార్గంలో పెట్టిన శిక్షణ లభించేదే కాదు.

## నాయకత్వానుభవం

అమెరికా భావికర్షక సమాఖ్య వ్యావసాయక వృత్తి విద్యాలయాల లోని పూర్తికాలపు విద్యార్థులసంస్థ. ఇది సాంఘికసేవా కార్యక్రమాలను నిర్వహిస్తూ వుంటుంది, ఈ కార్యక్రమాలలో పాల్గొనటంవల్ల ఈ సంస్థ సభ్యులు నాయకత్వానికి కావలసిన సామర్థ్యాన్ని సంపాదించుకొంటు

న్నారు. తమ పొదుపు బ్యాంకులద్వారా పొదుపు అలవాట్లు నేర్చుకొని డబ్బు నిలువచేస్తున్నారు. పార్లమెంటరీ సూత్రాలు నేర్చుకొంటున్నారు. బహిరంగ సభల్లో మాట్లాడటం అలవాటు చేసుకొనేందుకు, ఉపన్యాస పోటీలలో పాల్గొంటున్నారు. ఇటువంటి అనేక కార్యక్రమాల వల్లనూ, వ్యవసాయ వృత్తివిద్యా తరగతులలోని శిక్షణవల్లను వారు సమర్థులైన ప్రయోజకులైన రైతులు కావటమే కాక, చక్కని నడవడికీ పౌర ధర్మాన్నీ అలవరచుకొని, సాధారణంగా సమాజంలోను - ప్రత్యేకించి తమవర్గంలోను - తమ స్థానాన్ని పదిలపరుచుకొంటున్నారు.

## వ్యాపార విద్య :

చాలాకాలంగా సంయుక్త రాష్ట్రాలలో ఆ యా అంతస్థులకు తగిన వ్యాపారవిద్య ఉన్నత పాఠశాలల్లోను వైయక్తిక వ్యాపారపాఠశాలల లోను ఉన్నత పాఠశాలానంతర విద్యలోను అవర కళాశాలలలోను విశ్వ విద్యాలయాలలోను పట్టభద్ర తరగతులలోను నేర్పబడుతున్నది. ఈ సంస్థలలో నేర్పబడే వ్యాపార శిక్షణకు తోడుగా పెక్కువ్యాపార సంస్థలు, కొన్ని వర్తకసంఘాలు తమసొంత శిక్షణ కార్యక్రమాలను నిర్వహిస్తు న్నాయి. ఉద్యోగంలో ఉన్నవారి శిక్షణకోసం వైయక్తిక వ్యాపార సంస్థలు నిర్వహించే శిక్షణ తరగతులు ముఖ్యంగా తమ ఉద్యోగుల అభి వృద్ధి కోసమూ అభ్యున్నతికోసమూ ఉద్దేశింపబడినవే.

వ్యాపార శిక్షణనిచ్చే ఈ వివిధ పాఠశాలల విద్యాస్థాయికి అను గుణంగా ఆ యా విద్యార్థులు కార్యాలయాలలోను, తక్కిన వ్యాపార సంస్థలలోను, ఉన్నత పాఠశాలా ప్రమాణంలోని ఉద్యోగానికీ, ఉన్నత పాఠశాలానంతర విద్యాప్రమాణంలోని, అవర కళాశాలా ప్రమాణంలోని మధ్యరకం లేదా సాంకేతికమైన ఉద్యోగానికీ పనికి వస్తారు. విశ్వవిద్యాలయ పట్టభద్ర పాఠశాలా ప్రమాణంలోని అధి

పత్య పరిపాలకోద్యోగాలకూ పరిశోధకోద్యోగాలకూకూడా శిక్షణ ఈయబడుతుంది.

## కళాశాలా స్థాయికి తగ్గిన విద్య :

ఇంతకుముందు చెప్పినదాన్ని బట్టి, ఎంత విశాలమైన ప్రాతిపదిక పైన వ్యాపారశిక్షణ ఎన్ని అంతరువులుగా ఉన్నదో, ఈ శిక్షణనిచ్చే సంస్థలెన్ని విధాలుగా ఉన్నవో బోధపడుతుంది. ఇప్పుడు ప్రభుత్వ పరిశీలనక్రింద ఆధిపత్యం క్రింద నిర్వహింపబడే కళాశాలా ప్రమాణానికి తగ్గిన వ్యాపారవిద్యను గూర్చి చర్చిద్దాం.

అమెరికా సంయుక్త రాష్ట్రాలలో ప్రభుత్వోన్నత విద్యావిధానంలో వ్యాపారవిద్య ఒకవిశిష్ట భాగంగా ఉన్నది. ఇప్పటి ఉన్నత పాఠశాలా విద్యార్థులలో 9 నుంచి 12 తరగతుల వారితో సహా నూటికి 60 మంది ఒకటో రెండో వ్యాపారవిషయాలను ఐచ్ఛికంగా తీసుకొంటున్నారు. ఉన్నతవిద్య తొలియేండ్లలో వీరిలో చాలామంది తమ సొంతఉపయోగం కోసమూ, తమకు వ్యాపార రంగంలో ఉపయోగిస్తాయనీ, టైపుకొట్టటం ఇత్యాది అంశాలను తీసుకుంటారు. వ్యాపారవిద్యల్లో చాలాభాగం మాధ్యమికోన్నత పాఠశాలా శిక్షణలో ఉత్పత్తి రంగంలో ఉద్యోగాల కోసం నేర్పబడతాయి.

ఇటీవల కొన్నేండ్లపూర్వం ఎక్కువగా టైపిస్టులు స్టెనోగ్రాఫర్లు బుక్ కీపర్లు వ్యాపార యంత్రచోదకులు రకరకాల గుమాస్తాలు మొదలైన వారికి కావలసిన వృత్తివిద్యా శిక్షణ మాత్రమే ప్రభుత్వోన్నత పాఠశాలల్లో నేర్పబడేది. చిల్లర, టోకు మొదలైన వ్యాపారాలలో చేరగోరే వారికీ అదివరకే చేరి పనిచేస్తున్న వారికీ కావలసిన వృత్తిశిక్షణ 1937 కు పూర్వం ఇంత విస్తారంగా వృద్ధిచెందలేదు. 1937 లో వృత్తివిద్యకోసం ఆ యా రాష్ట్రాలకు కేంద్రప్రభుత్వం ఆ యా వృత్తులక్రింద ప్రత్యేకించి ధనసహాయం చేసింది. అంతటితో ఆ యా వృత్తులలో శిక్షణ అభివృద్ధి చెందసాగింది.



బాలవిద్యార్థులకు బోధ:

## వివిధ పాఠశాలలు - తరగతులు :

కళాశాలా ప్రమాణానికి, తగ్గిన వ్యాపార వృత్తివిద్య సాధారణంగా పూర్తికాలపు బడులలో పూర్తికాలపు విద్యార్థులకోసం ఏర్పాటు చేయబడింది. అల్పకాలిక పాఠశాలలలోను తరగతులలోను కొత్తగా ఉద్యోగాలలో చేరినవారికోసం, సాయంకాలపు తరగతులలో వ్యాపార రంగంలో పూర్తికాలం పనిచేస్తున్న వారికోసం, శిక్షణ ఈయబడుతుంది.

## సహకార శిక్షణ :

ప్రభుత్వోన్నత పాఠశాలలో వ్యాపారవృత్తి నభ్యసించే విద్యార్థులు ఎక్కువగా పూర్తికాలపు బడులలోనే శిక్షణ పొందుతారు. అలాంటి పాఠ

శాలలలోని వ్యాపారవిద్య వారిని ఆయా ఉద్యోగాలకు తయారుచేయటం కోసం ఏర్పడింది. ఇటీవలి సంవత్సరాలలో కార్యాలయ వస్తుశాలా శిక్షణలో అల్పకాలిక సహకార తరగతుల సత్వరాభివృద్ధి జరిగింది. ఉన్నత పాఠశాలల మాధ్యమికోన్నత దశలలో ఈ సహకార తరగతులు ఏర్పరచబడతాయి. ఈ తరగతులలో చదివేవారికి బడిలో చదువూ; బయట ఏదో ఒక వ్యాపారసంస్థలో అల్పకాలికమైన ఉద్యోగమూ వుంటాయి. దానివల్ల కొంత ఆదాకూడా వుంటుంది. ఆ వృత్తికి సంబంధించిన శిక్షణ పూర్తికాగానే అతడు పూర్తికాలపు ఉద్యోగి కావచ్చు. అతడు తనకు పనిలో గల అనుభవం వల్ల ఒక విశిష్ట గౌరవం పొంది, ఉన్నత పాఠశాలా పట్టభద్రుడవుతాడు.

## పెద్దల విస్తృత శిక్షణ :

చిల్లరటోకు వ్యాపారాలలో పూర్తికాలం పనిచేస్తున్న వారికి శిక్షణ తరగతులు 1938 నాటినుంచీ 10 రెట్లకు పెరిగాయి. ఈ శిక్షణ ప్రత్యేకించి సాయం తరగతులలో ఈయబడుతున్నది. ఆ యా వ్యాపార రంగాలలో ఎన్నిరకాల పనివారుంటారో, ఆ యా వ్యాపారాలు ఎన్నిరకాలుగా వుంటాయో, ఆ యా ఉద్యోగాలు ఎన్ని అంతరువులుగా వుంటాయో, అన్నన్ని విధాలుగా ఈ శిక్షణయొక్క స్వభావ స్వరూపాలుంటాయి. పెద్దవారికోసం నేర్పబడే ఈ వివిధ శిక్షణాక్రమంలో ఉదాహరణకు, అమ్మకంలో శిక్షణ, అమ్మేవారికి వ్యాపార వర్తమానం సేకరించటంలో శిక్షణ, వ్యాపారంలో శిక్షణ, ప్రచారంలో శిక్షణ, అమ్మకాలు పెంపొందించటంలో శిక్షణ ప్రత్యేకంగా ఈయబడతాయి. ఇది వ్యాపార రంగంలోని ఉద్యోగులకు కార్యకర్తలకు ఉద్దేశింపబడింది. ఆ యా శాఖాధిపతులకు, పర్యవేక్షకులకు పర్యవేక్షణలో శిక్షణ ఈయబడుతుంది. చిన్న చిల్లర వ్యాపారాలలోని యజమానులకూ మేనేజర్లకూ ఆయా వ్యాపారాలు నడపడంలోను, ఆధిపత్యం వహించడంలోను ప్రత్యేకశిక్షణ ఈయ

బడుతుంది. సమానమైన పనిపాటలుగల-లేక, దగ్గరి సంబంధంగల పనులు గల ఆయావర్గాల ప్రత్యేకావసరాలకు కావలసినశిక్షణనుబట్టి బోధనాక్రమం వుంటుంది. పాఠశాలతో వ్యాపార యజమానులు, ఉద్యోగస్థులు, తమకు ప్రాతినిధ్యంగల సలహా సంఘాలద్వారా శిక్షణావసరాలను నిర్ణయించ టంలోను, ఆ అవసరాలకు తగిన శిక్షణాక్రమాన్ని ఏర్పాటుచేయటంలోను సహకరిస్తారు.

## వ్యాపారవృత్తి విద్యాప్రయోజనం:

సలహాసంఘంయొక్క విస్తృత వినియోగంద్వారా వ్యాపార వృత్తి విద్యలలో అవసరమైన మార్పులును చేర్పులును తప్పనిసరిగా వస్తు న్నాయి. తగిన సామాన్యవిద్య సాంకేతికవిద్య వృత్తివిద్య కలిగి ఉండ టమే గాక, విజయవంతమైన ఆ ప్రత్యేక వ్యాపారానుభవం కలిగిన ఉపా ధ్యాయులను, పర్యవేక్షకులను నియమించటంచేత శిక్షణ సమర్థంగా నిర్వ హింప బడుతున్నది. వ్యాపారవృత్తివిద్య తాలూకు ప్రాథమికానుభవానికి అనుగుణంగా వ్యాపారగంగంలో ప్రముఖోద్యోగులే సాయంత్రపు బడు లలో ఉపాధ్యాయులుగా పనిచేస్తారు. ఉన్నత పాఠశాలలలోని అల్పకా లిక సహకార తరగతుల ఉపాధ్యాయులు. ప్రభుత్వ స్థానిక పర్యవేక్ష కులు, కళాశాలలలోని విశ్వవిద్యాలయాలలోని ఉపాధ్యాయ బోధకులు తగిన వ్యాపారానుభవం కలిగివుంటారు.

## గృహార్థిక విద్య:

అమెరికా అంతటా గృహార్థికవిద్యా కార్యక్రమం మొత్తంలో ప్రత్యేకించి తెలివితేటలతో కుటుంబజీవితంలో పాల్గొనటంమీద ఎక్కువ శ్రద్ధ వహించబడుతుంది. దేశంలో దాదాపు మూడింట రెండువంతులు ఉన్నత పాఠశాలలలో గృహార్థికవిద్య బోధిస్తారు. వృత్తివిద్యా నిధుల సహాయంతో ఆయా పాఠశాలలలో పెద్దతరగతులకు, అల్పకాలిక తరగ

తులకు ఉపాధ్యాయులను నియమిస్తారు. వారు ఆయా విద్యార్థుల ఇండ్లకు పోయి, వారి వారి కుటుంబాలను పరిశీలించి, గృహనిర్వహణలో వారికి తగిన శిక్షణ ఇస్తారు.

## సమర్థమైన కార్యక్రమం :

ఏ రాష్ట్రంలో గానీ, వివిధ వయస్సులకు చెందిన ఆ యా కుటుంబ సభ్యులకు ప్రాథమికోన్నత పాఠశాలల ద్వారాను, యువకుల కోసం పెద్దలకోసం ఏర్పడిన అల్పకాలిక శిక్షణ తరగతులద్వారాను, గృహనిర్వహణ విద్య అందజేయబడుతుంది.

గృహ జీవితానుభవాలను ఉన్నత పాఠశాలా విద్యార్థుల అవసరాలను దృష్టిలో పెట్టుకొని ఆయా ప్రాంతాలలో ఏయే విషయాలు గట్టిగా బోధించవలెనో, నిర్ణయింప బడుతుంది. ఆయా ప్రాంతాల ప్రత్యేకావసరాలనుబట్టి తిండి దుస్తులు ఇల్లు సామాను పెత్తనం పిల్లలశ్రద్ధ కుటుంబారోగ్యం అన్యోన్యత - ఈ సమస్యలన్నీ శిక్షణ క్రమంలో ఇమిడి వుంటాయి. బడిలోనూ ఇంటిలోనూ వాస్తవికానుభవం కలిగిన పిల్లల ద్వారా ఈ సమస్యలన్నీ పరిశీలించబడతాయి.

ఉపాధ్యాయులు వారి వారి ఇండ్లకుపోయి చూచి ఇండ్లలోని ఆయా విషయాలపై అనుభవంపొందే పద్ధతినీ, ఇంటి పరిస్థితులనూ, బడి కార్యక్రమంతో అనుసంధింపజేసే పద్ధతిని సూచిస్తారు.

## గృహ్య ప్రణాళికలు:

స్పష్టంగా యోజన చేయబడిన గృహనిర్వహణ కార్యక్రమంలోని ఒకానొక భాగమే గృహనిర్వాహణానుభవం. ఇట్టి వానినే గృహ్యాప్రణాళిక లంటారు. విద్యార్థులు తమ వ్యక్తిగతావసరాలకు అనుగుణంగా వుండి, తమ పాఠశాలా కార్యక్రమానికి సహాయభూతంగా వుండే గృహానుభవాలను ఎన్నుకొనటంలో ఉపాధ్యాయులు తోడ్పడుతారు. విద్యార్థులు

తమ అభివృద్ధినీ, సాధననూ, తెలిపేరకం రికార్డులనూ నివేదికలనూ తయారుచేస్తారు. ఉన్నత పాఠశాలా విద్యార్థుల నివేదికలనుబట్టి దేశమంతటా ఉన్న గృహ్యా ప్రణాళికల రకాలు ఈ క్రింద వివరించబడ్డాయి.

1. కూరగాయలను పలువిధాలుగా తయారుచేసి ఆ కుటుంబంలోనివారు ఎక్కువ తినేటంత ఆకర్షణీయంగా వడ్డించటం.

2. డబ్బు ఖర్చులేకుండా పడకటింటిని ఎక్కువ ఆకర్షణీయంగా సౌకర్యవంతంగా అనుకూలంగా తయారుచేయటం.

3. నిరుటి ఎండాకాలంలో కొన్న దుస్తులను ఉతకటం, కుట్టుకోటం; కొత్తరూపు దిద్దటం; కావలసిన కొత్త దుస్తులను ఎంచుకోవటం.

4. సరీగా ఆలోచించి మామూలుకంటె తక్కువ ధనమూ, కాలమూ వెచ్చించి తాను ఒకపూట వండిపెట్టటం మూలంగా తల్లికి వారానికి ఒకరోజు విశ్రాంతి కల్పించటం.

5. పిల్లల ఆటవస్తువులు ఇతర సామాగ్రి పెట్టుకోటానికి ఒక చోటు ఏర్పాటుచేసి, వారు వాటిని అక్కడే పెట్టుకొనేటట్లు చూడటం.

6. తోటలో పెరిగే పూలతో ఇంటిలోని అన్ని గదులనూ కన్నుల పండువుగా అలంకరించటం.

7. అల్యూమినియం సామాన్లు తోమటానికి అన్ని పద్ధతులూ ప్రయోగించి, వంటయింటి సామాన్లు శుభ్రపరచటానికి ఏది మేలైనదో నిర్ణయించటం.

దేశంలోని కుటుంబాల సమస్యలవలెనే, పెద్దలతరగతులలో తీసికొనే ప్రణాళికలు కూడా వివిధంగా వుంటాయి. తల్లిదండ్రుల తరగతులలో అధికభాగం కుటుంబ జీవితానికీ, తలిదండ్రులకూ, బిడ్డలకూ మధ్య సదభిప్రాయాన్ని పెంచటానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తాయి. ఇట్టి తరగతులలో నానాటికీ ఎక్కువమంది తండ్రులు పాల్గొంటున్నారు. కొన్ని

ప్రాంతాలలో పెద్దలకోసం ఏర్పాటుచేయబడిన ఆకాశవాణి తరగతులు కూడా ఆదరణీయాలుగా వుంటాయి. గృహాభివృద్ధి శిక్షణలోని పెద్దల తరగతులవారు అప్పుడప్పుడు ఆకార పరిణామాలలో సామాన్యమైన గృహం ఒకటి తీసుకొని కనీసఖర్చుతో దానిని నివాసయోగ్యంగా చేయటంవల్ల నేర్చుకొంటారు.

ఇటువంటి సాంఘిక కార్యక్రమాలలో ఇంకా మంచి గృహోద్యానాలు వేయటం, దారులు బాగుచేయడం, పొదలు పెంచటం, పాఠశాలల్లో ఆరోగ్య కార్యక్రమానికి తోడ్పడటం, యువకులకు వినోదశాలలు నిర్మించటం - మొదలైనవి ఉన్నాయి. ఇట్టి కార్యక్రమాలలో తక్కిన సంస్థలూ సంఘాలూ తోడ్పడుతాయి.

చాలా పల్లెప్రాంతాలలో, ఆ పల్లెకుటుంబాల సంయోజనంలో గృహనిర్వహణ తరగతులూ, వ్యవసాయ తరగతులూ కలసి మెలిసి పని చేస్తాయి. జీవిత గృహ కార్యక్రమాలు అనబడే ఈ సంయుక్త ప్రణాళికలలో గృహ సౌకర్యాలూ రకరకాల ఆహార సమీకరణలూ యోజింపబడతాయి. ఇంటికి కావలసిన పరికరాలు- వాని క్రమము, ఇంట్లో నీరుతోడడానికి అయ్యే వ్యయం మొదలైనని పురుషులు అంచనా వేస్తుంటే, వంట ఇంటి ఏర్పాట్లు ఏవి ఎలా వుండటం మంచిదో, అందుకు ఎంత ఖర్చు అవుతుందో స్త్రీలు పరిశీలిస్తూ వుంటారు. వారు పరస్పర భావవ్యక్తీకరణ కోసమూ, సమన్వయంకోసమూ సమావేశ మవుతుంటారు. ఈ విధంగా బాలబాలికలూ స్త్రీ పురుషులూ కలసి మెలసి పనిచేయటంవల్ల గృహము నందలి సాధారణ పరిస్థితులు, గృహస్వరూపాలు అభివృద్ధిలోకి వస్తున్నాయి. పరిశుభ్రత, పరిపోషణ, అన్యోన్యత మొదలైన తక్కిన అనేక ప్రణాళికలు గూడ తీసుకోబడుతున్నాయి.



చిన్న పిల్లలకుకూడా సాంకేతిక విద్యాబోధ

## సౌ క ర్యా లు :

అన్నిరకాల గృహబాధ్యతలనూ నేర్చుకోటానికి పాఠశాలల్లో తగిన సౌకర్యా లుంటాయి. అయితే వివిధ తరగతులలో వుండే సౌకర్యాలలో భేదం వుంటుంది. కొన్నింటిలో ఒకే ఒకగది తరగతిలో గృహార్థిక శిక్షణమాత్రమే వుంటుంది. ఇంకా కొన్నింటిలో పెక్కు గదుల తరగతు లుంటాయి. కొన్నిటిలో ఒక కుటీరంలోనే గృహార్థిక కార్యక్రమ శిక్షణ వుంటుంది. అయితే చాలా పాఠశాలలలో ఇట్లే ప్రాతిపదికగా శిక్షణ ఇస్తారు. కాని ఇంటిలో వున్నలాంటి పరిస్థితులనే కల్పించినప్పుడు, ఈ అన్నింటిలోనూ ఒక రకములైన సమస్యలనే పరిశీలించవచ్చు.

## వృత్తిక పారిశ్రామిక విద్య :

తయారైన యంత్రాల రూపుతీర్చటం, ఉత్పత్తిచేయటం, విడి భాగాలను కూర్చటం, బాగుచేయటం - మొదలైన వృత్తులు, చేతిపనులు, పారిశ్రామిక వ్యవహారాలు - వీటిమీదనే వృత్తికపారిశ్రామిక రంగాలలో వృత్తివిద్య వుంటుంది. ఇంజనీరింగ్ స్థాయికి తగిన యంత్రోత్పత్తి సంస్థలలో పనిచేసేవారే ముఖ్యంగా ఈ రంగంలో విద్యార్థులు.

తక్కిన రంగాలలోని వృత్తివిద్యల మాదిరిగానే ఈ రంగంలో కూడా వృత్తివిద్యకు రెండు ప్రధానలక్ష్యాలున్నాయి: 1. గుర్తింపబడిన ఏదోఒక వృత్తిక పారిశ్రామిక సంస్థలో ఉద్యోగానికి తగిన నిర్మాణాత్మకమైన శిక్షణ ఇవ్వటం. దీనినే వృత్తిప్రారంభ శిక్షణ అంటారు. 2. అదివరకే వృత్తిక పారిశ్రామికోద్యోగాలలో నున్నవారి తెలివితేటలను వృద్ధిపరచి, వారి అభివృద్ధికి దోహదమిచ్చే శిక్షణ గరపటం -దీనిని అభివృద్ధిశిక్షణ అంటారు.

1950 జూన్‌తో ఆఖరైన పాఠశాలా సంవత్సరంలో ప్రభుత్వ వృత్తిక పారిశ్రామిక శిక్షణకు హాజరైన విద్యార్థులసంఖ్య ఈ క్రింది విధంగా వుంది.

| | |
|---|---|
| ప్రారంభ శిక్షణ | 2,22,739 |
| అభివృద్ధి శిక్షణ | 5,82,068 |
| మొత్తం | 8,04,807 |

## వృత్తిక ప్రారంభ విద్య :

వృత్తిక ప్రారంభవిద్య ముఖ్యంగా పూర్తికాలపు ఉన్నత పాఠశాలల్లో నేర్పబడుతుంది. వీనిలో కొన్నిటిని వృత్తివిద్యాలయాలంటారు. కాని చాలా సందర్భాలలో మామూలు ఉన్నత పాఠశాలలలోని వృత్తిక తరగతులలో ఈ శిక్షణ ఇస్తారు. ఈ రకం శిక్షణ పొందే విద్యార్థు

లందరూ ఉన్నత పాఠశాలా వయస్సువారే. వారు తమకాలమంతా ఆ పాఠశాలల్లోనే వ్యయిస్తారు. అలాంటిచోట్ల వర్తకవిద్య నభ్యసించే విద్యార్థులు తాము కోరుకొన్న వృత్తియందు తమ కాలంలో నూటికి 50 నుంచి 75 వంతులకాలం శిక్షణ పొందుతారు. తక్కిన బడికాలంలో వారు ఇంగ్లీషు, చరిత్ర, విజ్ఞానశాస్త్రం—ఇంకా తక్కిన విషయాలు నేర్చుకొంటారు. ఈ వృత్తివిద్యలో ఆయా వృత్తులకు సంబంధించిన యంత్రాలు నడపటం వగైరా మాత్రమేగాక దానికి సంబంధించిన శాస్త్రమూ చిత్ర రచనా లెక్కలూ మొదలైన ముఖ్యాంశాలపై గూడా శిక్షణ వుంటుంది.

ఈ రకం పూర్తికాలపు పాఠశాలల్లో యంత్రాలబాగు, అచ్చుపని, వంట, గుడ్డలు కుట్టటం మొదలైన ఒకకొట్లో చేయదగిన వృత్తులకు పరిమితమై మాత్రమే ఆ శిక్షణ వుంటుంది. కొన్ని సమయాలలో బడి కర్మాగారంలో నేర్పటానికి సాధ్యంకాని పనిపాటల్లో గూడా శిక్షణ వుంటుంది. వడ్రంగం, ఇటుకలతో ఇళ్ళు కట్టటం మొదలైనవి ఇటువంటివి. వీటి విషయంలో బడిబయట ఎంతో అనుభవం సంపాదించాలి. ఆయా వృత్తులలో బాగా పరిచితులైనవారి అనుభవంమీద ఈ శిక్షణ ఆధారపడి వుంటుంది. ఆయా విద్యార్థులు ప్రవేశింపనున్న వృత్తుల విషయంలో పెద్దల అనుభవాలు ఎంతో పరిజ్ఞానాన్ని ఇస్తాయి. అంతేగాక, కష్టసాధ్యాలైన ఆయా పనులు ఎట్లు చేయవలెనో మార్గం చూపుతాయి.

ఆ యా వృత్తులలో సాధారణంగా వుండే పరిస్థితులకు సాధ్యమైనంత సన్నిహిత పరిస్థితులు కల్పించటానికి తగినకృషి చేయబడుతుంది. బడి కర్మాగారాలలో ఉండే పరికరాలు వగైరా మామూలు కర్మాగారాలలో వుండేలాంటివే వుంటాయి. పారిశ్రామికోద్యోగాలకు కావలసిన ప్రమాణాలే ఇక్కడకూడా పాటింపబడతాయి. పారిశ్రామిక సంస్థలలో రేపు ఏయే ఉత్పత్తి కార్యక్రమాలలో విద్యార్థులు పాల్గొనవలసి

వుంటుందో, అలాంటి వాటిలోనే వారికి శిక్షణ ఈయబడుతుంది. కాబట్టి వడ్రంగం నేర్చుకొన్నవారు నిజంగా ఇళ్ళుకడతారు, రొట్టెలుచేయటం నేర్చుకొన్నవారు తినటానికి పనికివచ్చే మంచిరొట్టెలు చేయగలరు. వృత్తిలో పూర్తిశిక్షణ పొంది, అనుభవం కలిగి, ఉపాధ్యాయ శిక్షణ కూడా పొందినవారే అలాంటి పాఠశాలల్లో ఉపాధ్యాయులుగా వుంటారు.

## అభివృద్ధి శిక్షణ :

పైనచూపిన లెక్కలప్రకారం వర్తక పారిశ్రామిక శిక్షణ తరగతులకు హాజరయ్యే వారిలో అదివరకే ఒకపనిలో వుండి శిక్షణ పొందే వారు నూటికి 70 మందికి మించివున్నారు. అలాంటి అభివృద్ధి శిక్షణ తరగతులు రకరకాల పాఠ్యాంశాలలో భిన్న భిన్నాలుగా వున్నాయి. కొన్ని అభివృద్ధి తరగతులకు యువపారిశ్రామికులు తమ పనికాలంలో కొంతకాలంపాటు హాజరవుతారు. కొన్ని రాష్ట్రప్రభుత్వాలు ఒకవయః పరిమితికి లోబడిన యువకులు రోజుకు 4 నుంచి 8 గంటలు బడికివచ్చి అభివృద్ధి శిక్షణపొందే షరతుమీద మాత్రమే వారు ఆయా ఉద్యోగాలలో చేరటానికి అనుమతిస్తాయి. చాలామంది అలాంటి విద్యార్థులు అల్పకాలిక తరగతులలో చేరుతారు. వారేగాక శిక్షణ పొందవలసిందిగా తమ యజమానులచేత కోరబడిన క్రొత్త పనివారు కూడా ఈ అల్పకాలిక తరగతులకు హాజరవుతారు. బ్లూ ప్రింట్లు చదవటం, బొమ్మలు గీయటం, విజ్ఞానశాస్త్రం, - ఆ యా వృత్తుల తాలూకు కొన్నిఘట్టాలు, భద్రతా సూత్రాలు, ఆయా వృత్తులు, ఆర్థిక తత్వము, చరిత్ర, ఇంగ్లీషు, పౌరధర్మం మొదలైన అంశాలతో గూడి వారిశిక్షణ వుంటుంది.

ఈ శిక్షణ తరగతులలో రెండవరకం అదివరకే ఉద్యోగాలలో వున్నవారికి సాయం వేళలగానీ, ఇతర తీరిక సమయాలలో గానీ పెట్టే తరగతులు. ఈ తరగతులకు హాజరు కావటంవల్ల వేలకొలది పనివారు తమ తమ వృత్తులయందు నేర్పునూ, విజ్ఞానాన్నీ అభివృద్ధి చేసుకొంటు

న్నారు. ఈ తరగతులకు హాజరయ్యేవారు 16 ఏండ్లనుండి 75 ఏండ్లవారి వరకూ ఉన్నారు. వీరి వయస్సుల్లో ఉన్న తేడాకంటె వీరు నేర్చుకొనే అంశాలు ఇంకా వివిధంగా వుంటాయి.

ఈ అభివృద్ధి శిక్షణ తరగతులలో ఎన్నెన్ని రకాల వృత్తులు నేర్పుతున్నారో తెలుసుకోవాలంటే ఈ క్రింది సంగ్రహ పట్టిక కొంత తోడ్పడుతుంది. ఎయిర్ కండిషన్ చేయటం, విమాన నిర్మాణం, రొట్టెలు చేయటం, వడ్రంగం, నమూనాలు గీయటం, డీసెలు ఇంజన్లు నడపటం, విద్యుత్తుతో పూతవేయటం, రాళ్ళూ రత్నాలూ చెక్కటం. హోటలుపని, వస్తువుల రిపేరు, బంగారుపని, నూనె యంత్రాగారపు పని, పాలదాది పని, నూనెబర్నర్లు పెట్టటం, బాగుచేయటం, పని, కుట్టుపని. పెంకునేత, గడియారాల రిపేరు, అతుకులు పెట్టటం.

## సహకార శిక్షణ :

వర్తక పారిశ్రామిక విద్యలో బాగా త్వరలో పైకివచ్చిన రకం విద్య సహకార శిక్షణ. నిజానికి ఇది పగటిబడిలో నేర్చుకొన్నదానికి తోడు, బయట కార్ఖానాలలో పనిచేస్తూ అనుభవం సంపాదించటం. ఈ ప్రకారం బడిపిల్లలకు ఉద్యోగాలు దొరుకుతాయి. సగంకాలం కార్ఖానాలో బడిలో చదువూ, సగంకాలం పనీ, ఒకదాని తర్వాత ఒకటిగా వుంటాయి. ఒకపూట బడిలో, ఒకపూట కార్ఖానాలో; ఒకరోజు ఇక్కడా, ఒకరోజు అక్కడా; ఒకవారం ఇక్కడా, ఒకవారం అక్కడా; ఒకనెల ఇక్కడా, ఒకనెల అక్కడా - ఇలా పనిచేయవలసి వుంటుంది. కార్ఖానా పనికాలంలో వారికి పూర్తిజీతం ఇస్తారు. దానికితోడు పనిచేస్తుండగానే వారి యజమానులవద్ద వృత్తి శిక్షణ పొందుతారు. బడిసమయంలో వారు ఆ యా వృత్తులకు తోడ్పడే శిక్షణా, సాధారణములైన ఇతర పాఠ్యాంశాలు నేర్చుకొంటారు. ఈ సహకార విధానంవల్ల యువకులైన పనివారికి మంచి అవకాశాలు

ఉన్నాయి. వాస్తవికమైన ఉద్యోగ పరిస్థితులలో దేశంలోని అనేక వృత్తుల్లో వున్న సౌకర్యాలను వినియోగించుకొని, వారు తగుశిక్షణ పొందుతారు. ఇవి మరొకవిధంగా పాఠశాలల్లో మాత్రమే అయితే సాధ్యం కావు. ఈ విధానంక్రింద విద్యార్థులు తాము ముందు చేరదలచిన వృత్తియందు శిక్షణా, అనుభవమూ పొందటమే కాక, ఉన్నత పాఠశాలా పట్టభద్రులవుతారు.

ఈ వర్తక పారిశ్రామిక తరగతులు స్త్రీ పురుష లుభయుల కోసమూ ఉద్దేశింపబడినవి. కొన్ని వృత్తులు పూర్తిగా కాకపోయినా, చాలాభాగం పురుషులకు యోగ్యంకావు. అలాంటి వాటిలో కేవలం స్త్రీలకే శిక్షణ ఇస్తారు. చాలా వృత్తులలో స్త్రీ పురుష లుభయులకూ ఉద్యోగాలు దొరుకుతాయి, కనుక ఆ యా వృత్తులలో ఉభయులకూ శిక్షణ గరపుతారు. ఇటీవల పదేండ్లలో అమెరికాలో వచ్చిన పెద్దమార్పు ఏమంటే, అదివరలో పురుషులు మాత్రమే పనిచేసే అనేక వృత్తులలో ఇప్పుడు స్త్రీలకుగూడా ప్రవేశం లభించటం. పనివారి కొరత గలిగేయుద్ధ కాలంలాంటి రోజుల్లో వృత్తిపాఠశాలలలో చిన్న చిన్న యంత్రాలు నడపటం మొదలు అతిసున్నితమైన పనితనం, సాంకేతిక పరిజ్ఞానం, ఖచ్చితమైన నిర్ణయం అవసరమైన పనులదాకా స్త్రీలకు శిక్షణ యీయబడింది. స్త్రీలకు ప్రత్యేకంగా శిక్షణ ఈయటానికి కొన్ని వృత్తి విద్యాలయాలు ఏర్పరుపబడ్డాయి. కాని చాలామంది స్త్రీలు ఉభయులకోసం ఏర్పరుపబడిన పాఠశాలలలోనే శిక్షణ పొందుతున్నారు.

# 16- వయోజన విద్య

## విద్యార్థుల సంఖ్య :

సంయుక్త రాష్ట్రాలలో ఉన్నత పాఠశాలగానీ కళాశాలగానీ విడిచి వెళ్ళినంతనే యువకులకు విజ్ఞానసంపాదనకు గల అవకాశాలు అంతరించిపోవు. ఇంచుమించు అన్ని నగరాలలోనూ పట్టణాలలోనూ కొన్ని గ్రామాలలోనూ నేర్చుకోగోరే వారికోసం సాయం పాఠ శాల లుంటాయి. ప్రస్తుతం ప్రభుత్వ పాఠశాలల్లో మాత్రమే ఏదో ఒక విద్య అభ్యసించేవారు 30 లక్షలదాకా వున్నారు. నానా జీవనమార్గాల్లో కృషిచేస్తున్న యువకులనేకులు శాస్త్రీయాభివృద్ధిని గురించీ. గృహ కుటుంబ జీవితాభ్యుదయాన్ని గురించీ, జాతీయాంతర్జాతీయ విషయా లను గురించీ, స్వపర భాషలను గురించీ, తమ తీరికకాలాన్ని మరింత సద్వినియోగపరచగల విద్యావసరాన్ని గురించీ, నేర్చుకోవాలని తహ తహ లాడుతున్నారు. వైద్యశాస్త్రంలో వచ్చిన అభివృద్ధి మానవ జీవిత ప్రమాణాన్ని పెంచింది. అందువల్ల పెద్దల విద్యపట్ల ఆసక్తికూడా పెరి గింది. ఈ పాఠశాలల్లో నానాటికీ చేరేవారి సంఖ్యాధిక్యం చూస్తే అంత కంతకూ ఎక్కువమంది తమ జీవితమంతా విజ్ఞానార్జనకు కృషిచేయ గోరుతున్నారనేది స్పష్టం.

## విజ్ఞానార్జనకు అవకాశాలు :

ప్రభుత్వ సంస్థలూ ప్రజాసంస్థలూ పెద్దల విద్యకు అవకాశాలు కల్పిస్తున్నాయి. కొన్ని నగరాలలో పాఠశాల లన్నింటికీ కలిపి ఒక వయోజన విద్యాదర్శకు డుంటాడు. ఈయన పాఠశాలా పర్యవేక్షణాధి కారికి సూటిగా బాధ్యుడు. తక్కిన నగరాలలో ప్రాథమిక లేక ఉన్నత పాఠశాలతో సంబంధించిగానీ, అవర కళాశాలతో సంబంధించిగానీ ఈ యువ విద్యా కార్యక్రమం వుంటుంది. అలాంటి సందర్భాలలో ఆ

పాఠశాలా ప్రధానోపాధ్యాయుడైన యువ విద్యాదర్శకుడు తన కార్య క్రమానికి మాత్రమే బాధ్యత వహిస్తాడు.

పాఠశాలలు పయోజన విద్యకు క్రొత్త పద్ధతులనూ మార్గాలనూ అన్వేషిస్తున్నాయి. బడి పరిధులను దాటికూడా యువకులకు విద్యా ప్రదానం చేస్తున్నాయి. సమాజ నాయకులకు శిక్షణ ఇవ్వటంద్వారాను, సామాజిక సంస్థలు తమ విద్యావిషయిక కార్యక్రమాలు పెంపొందించటంలో సహాయపడటం ద్వారాను, పాఠశాలేతర తరగతులకు విద్యావసర పరికరాలు సామగ్రి అవకాశాలు కల్పించటం ద్వారాను, పాఠశాలలు తమ ప్రభావాన్ని విస్తరింపజేస్తున్నాయి. వినోదశాలలు, కార్మికసంఘాలు, వ్యాపారసంస్థలు, పౌరసంఘాలు వీటి సహకారంతో చాలా విద్యా విషయిక కార్యక్రమాలు నిర్వహింపబడుతున్నాయి.

## పెద్దల విద్య: విశ్వవిద్యాలయ కళాశాలల పాత్ర:

ప్రభుత్వ, వైయక్తిక - కళాశాలలూ, విశ్వవిద్యాలయాలూ, పట్ట పరీక్షలకై విద్యార్థులు చదువదగిన సాయంత్రపు పాఠశాలలు నడపటం ద్వారా పెద్దల విద్య విషయంలో ప్రధానపాత్ర నిర్వహిస్తున్నాయి. ప్రభుత్వ విశ్వవిద్యాలయాలూ తక్కిన ఉన్నత విద్యాసంస్థలూ అవకాశం కల్పించిన సాధారణ, సాంకేతిక విద్యాతరగతులలో దాదాపు 8 లక్షల మంది చదువుకొంటున్నారు. సమాజ కళాశాలల్లో ప్రాథమిక విద్య, ఉన్నతవిద్య పెద్దలకు అందజేయబడుతున్నాయి.

క్రైస్తవ యువతీసంఘం, సమాజకేంద్రాలు, దేవాలయాలు, వివిధ వినోద శాలలు, అధ్యయన సంఘాలు, జాతీయారోగ్య భద్రతా సంస్థలు, కార్మికసంఘాలు - ఈ మొదలైన ప్రజాసంస్థలు పయోజన విద్యాకార్యక్రమంలో విస్తృతావకాశాలు కల్పిస్తున్నాయి. వీటిలో చాలా

భాగం పిల్ల లిచ్చే జీతాలమీద, విరాళాలమీద ఆధారపడి పనిచేస్తున్నాయి. ప్రతి సంవత్సరం ఉత్తరప్రత్యుత్తరాల ద్వారా విద్యనేర్పే పాఠశాలల లోనే పదిలక్షలమంది దాకా చదువుకొంటున్నారు.

## వ్యవసాయశాఖా కార్యక్రమాలు :

ఈపై జెప్పబడిన వయోజన విద్యాకార్యక్రమాలకు తోడు, వ్యవసాయ శాఖ ఆ యా ప్రాంతీయ వ్యవసాయ శాఖాధికారులద్వారా, ప్రదర్శకుల ద్వారా, (4-H) క్లబ్బులద్వారా, ప్రాంతీయ స్వయంసేవకులద్వారా వయోజన విద్యా కార్యక్రమాలు నిర్వహిస్తూ, ఏటేటా 70 లక్షలమందికి విద్యా ప్రదానం చేస్తున్నది. వ్యవసాయశాఖవారు ఆ యా సామాజిక వర్గాలకు అవసరమైన సమాచారం, అవకాశాలు, ఆ యా ప్రత్యేక సమస్యలపై సలహాలు అందజేసి, వారితోకలిసి కృషి చేస్తారు. (4-H) క్లబ్బులద్వారా యువజనులు పశువృద్ధి, పైర్లపెంపకం, తోలు ఊనటం, నిలువ చేయటం, కుట్టుపని - మొదలైన పలు పథకాలపై పనిచేస్తుంటారు.

ముద్రిత ప్రతులద్వారా, దృశ్యబోధనద్వారా, ప్రదర్శనాలద్వారా, బహిరంగ సభలద్వారా, ఈ ప్రాంతీయాధికారులు రైతులకూ రైతు వనితలకూ రైతు యువకులకూ పరిశోధనశాలలలో కళాశాలలలో చేయబడిన ఆ యా పరిశోధనా ఫలితాలను అవగతం చేస్తారు.

ప్రభుత్వగ్రంథాలయాలుకూడా ఎక్కువ పుస్తకాలను సంపాదించి, ఆ యా రికార్డులు, ఫిల్ములు మొదలైన పరికరాలు ప్రోగుచేసి, వయోజన విద్యకు తోడ్పడుతున్నారు. సంచార గ్రంథాలయాలు - అంటే పుస్తకాలు తీసికొనిపోయే మోటారు ట్రక్కులు - పుస్తకాలు, పత్రికలు, కరపత్రాలు, మొదలైనవాటిని మారుమూలగ్రామాలకు తీసికొని పోతున్నాయి. వర్తమాన సమాచారం అందరికీ అందజేయటంకోసం అసంఖ్యాక శాఖా గ్రంథాలయాలు నెలకొల్పబడ్డాయి.

వయోజనవిద్య నానాటికీ ప్రభుత్వ విద్యాశాఖవారి బాధ్యతగా పరిణమించింది. స్థానిక విద్యాకార్యక్రమాల కోసం 21 రాష్ట్రాలు తమ నిధులను ప్రత్యేకిస్తున్నాయి. కాని చాలా సందర్భాలలో మొత్తం అయ్యే వ్యయంలో, ప్రభుత్వ సహాయభాగం మిక్కిలి తక్కువ. మూడింట ఒకవంతు రాష్ట్రాలలో వయోజన విద్యాభివృద్ధికోసం పూర్తికాలపు ఉద్యోగులు నియమింపబడ్డారు. తక్కిన చాలా రాష్ట్రాలలో కొంతకాలంపాటు వయోజన విద్యాకార్యక్రమాలు పరిశీలించే ఉద్యోగులున్నారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామానంతరం చాలా రాష్ట్రాలు వయోజన విద్యాదర్శకులను నియమించాయి. అన్ని రాష్ట్రాలలోనూ వృత్తి విద్యాదర్శకులే పెద్దల వృత్తివిద్యాశిక్షణను పరివేక్షిస్తారు.

కేంద్ర సహాయంతో నిర్వహింపబడే వృత్తివిద్యా కార్యక్రమం క్రింద రెండు తెగలవారికి శిక్షణ లభిస్తుంది: 1. పూర్తికాలపు బడులలో చేరినవారికి, 2. బడి మానివేసి వృత్తి వ్యాపార రంగాలలో పనిచేస్తూ, కొంతకాలంపాటు శిక్షణకోసం బడికి హాజరయ్యేవారికి. ఇందులో రెండవ తెగవారు వయోజనులు. 1949 లో వృత్తి విద్యాలయాలలో చేరిన వారి మొత్తం 30,94,646. అందులో 19,31,946 మంది (అంటే 62%) సాయం పాఠశాలల్లోగానీ, అల్పకాలిక పాఠశాలల్లోగానీ, వృత్తి విద్యా తరగతులకు హాజరయ్యే వయోజనులే. వీరితో వయోజన విద్యా కార్యక్రమం క్రింద పైకివచ్చిన వారి సంఖ్య మిక్కిలి అధికమవుతుంది. ప్రతి రాష్ట్రమూ వ్యవసాయ, వ్యాపార గృహ నిర్వహణ, పారిశ్రామిక రంగాలలో వృత్తివిద్యాశిక్షణను ఏర్పాటుచేస్తుంది. ఈ అన్ని రంగాలలోనూ అన్ని రాష్ట్రాలలో వయోజనులకు శిక్షణ లభిస్తుంది.



చిత్రలేఖాభ్యాసము

# 17- ప్రత్యేక విద్యాసౌకర్యాలు

## అసాధారణ బాలురకు ప్రత్యేక విద్య :

వికలాంగులైన, వికల మనస్కులైన, సాంఘికంగా వెనుకబడిన బాలబాలికలకోసం ఏర్పరచబడిన విద్యను ప్రత్యేకవిద్య అంటారు. వికలాంగులైన, విశిష్టలక్షణాలు కల్గిన ఈ విద్యార్థుల శిక్షణ బాధ్యతలో ఎక్కువ భాగాన్ని ఆ యా స్థానిక ప్రభుత్వశాఖలే వహిస్తాయి. మరీ విపరీతంగా వికలురైన వారు ప్రత్యేక వసతిగల పాఠశాలలకు పంపబడతారు.

## అసాధారణ బాలురకు దైనిక పాఠశాలల్లో అవకాశం :

వికల బాలురకు పగటి పాఠశాలలలో ప్రత్యేక విద్యాశాఖవారి పర్యవేక్షణక్రింద అవకాశాలు కల్పింపబడతాయి. ప్రాథమిక పాఠశాలల్లోను, ఉన్నత పాఠశాలల్లోను శారీరకంగా మానసికంగా వికలురైన బాలురకోసం ప్రత్యేకతరగతులు నడుపబడతాయి. సాధారణ బాలురతరగతులలో చదువుకొనే అసాధారణ బాలురకోసం మామూలు చదువుకాక, వారి కవసరమైన అదనపువిద్య నేర్పబడుతుంది. ఉదాహరణకు నత్తిపిల్లలకు చెవిటిపిల్లలకు మధ్యమధ్య ఆయా పాఠశాలలను సందర్శించే ఉపాధ్యాయులు పలుకుబడి సరిచేసుకొనే పద్ధతులు, పెదవుల కదలికను బట్టి ఎదుటివారు చెప్పేది, అర్థంచేసుకొనే పద్ధతులు నేర్పుతారు.

ఈ ప్రత్యేక విద్యను పొందుతున్న విద్యార్థులలో నత్తివారు మిక్కిలి ఎక్కువ. అంతకంటె వెనుకబడినవారు, మందబుద్ధులు కొంచెం తక్కువ సంఖ్యలో వుంటారు. నూటికి 50 నుంచి 75 వరకు తెలివి తేటలుగల పిల్లలకోసం చాలా పాఠశాలలలో ప్రత్యేక విద్యా కార్యక్రమాలు చాలా తరచుగా ప్రాథమిక పాఠశాలలలోనూ, ఉన్నత పాఠశాలలలోనూ నడుపబడుతున్నాయి. సాధారణంగా ఆయా విద్యార్థుల పరిమితిని సామర్థ్యమును బట్టి వారికి ప్రాథమికోన్నత పాఠశాలలలో శిక్షణ ఇప్పించటం మంచిదని తోస్తుంది. చాలా ప్రాథమికోన్నత పాఠశాలలలో మామూలు విద్యార్థులతో పాటు కలిసి మెలిసి పనిచేయటానికి వీరికి అవకాశం వుంటుంది.

చాలా దైనిక పాఠశాలలలో అంగవైకల్యం మనోవైకల్యం కలవారు చదువుకొనే అవకాశం వుంటుంది. అట్టివారికోసం తరచుగా వైద్య సౌకర్యాలు, ప్రత్యేకం కూర్చొనే ఏర్పాట్లు, వంపు బల్లలు కల ప్రత్యేక పాఠశాలలు నడుపబడుతున్నాయి. ఈ పిల్లలకోసం మామూలు ప్రాథమికోన్నత పాఠశాలలలో కొన్నిగదులు ప్రత్యేకిస్తారు. ఈ వికలాంగు

లైన పిల్లలకోసం నడుపబడే దైనిక పాఠశాలా కార్యక్రమాలలో ఆయా స్థానిక ఆరోగ్య శాఖాధికారులు, శిశు సంక్షేమ సంస్థలు సహకరిస్తారు. మరీ అంగవైకల్యంగల పిల్లలు అనియతంగా ప్రత్యేకపాఠశాలల్లో గానీ, తరగతులలో గానీ చదువుకోవచ్చు, తక్కినవారిని అవసరాన్నిబట్టి అట్టి పాఠశాలల్లో కొద్దిమాసాలపాటో సంవత్సరాలపాటో ఉంచుతారు. వికలాంగుల తరగతులలో చేర్చుకోబడిన పిల్లలకు తరచుగా ఉచితప్రయాణ సౌకర్యాలు కలిగించబడుతాయి.

తమ యిండ్లనుండి కదలజాలనంతటి అంగవైకల్యంగల పిల్లల కోసం స్థానిక పాఠశాలోపాధ్యాయుల్లో ఒకరు నియమింపబడతారు. ఆయన ఆ పిల్లవాని ఇంటికిపోయి విద్యాబోధ చేస్తారు. చాలా విద్యాసంస్థలు స్థానిక వైద్యశాలలలోనూ, పరిపోషణాలయాలలోనూ, అధ్యయన తరగతులను ఏర్పాటుచేస్తాయి.

పెద్ద పెద్ద పట్టణాలలో చెవిటివారికీ గ్రుడ్డివారికీ విద్యాబోధనకు మామూలుగా అవకాశాలు కల్పింపబడినప్పటికీ, ప్రత్యేకంగా పగటిబడి తరగతులు అంతగా కన్పించవు. చాలా కొద్ది నగరాలలో మాత్రం గ్రుడ్డి వారికి పగటిబడి తరగతులున్నాయి.

సాంఘికంగా మానసికంగా అస్వస్థులైన పిల్లలకోసం ప్రత్యేక తరగతులు ఏర్పాటుచేయబడుతాయి. మిక్కిలి తరచుగా వారిని మామూలు ప్రాథమికోన్నత పాఠశాలల్లోనే వుంచి, పాఠశాలా సంఘసేవకుల సహాయాన్ని అందజేస్తారు. కొన్ని పాఠశాలల్లో ప్రభుత్వ పాఠశాలా వైద్యుని మానసిక వైద్యసహాయం కూడా కల్పించబడుతుంది.

ప్రత్యేకం తెలివితేటలుగల పిల్లల విద్య విషయంలో ఇటీవల మిక్కిలి శ్రద్ధ చూపబడుతున్నది. అత్యధికములైన స్థానిక పాఠశాలా సంస్థలలో మామూలు ప్రాథమికోన్నత పాఠశాలలలోనే వీరి అభివృద్ధికి ప్రత్యేకావకాశాలుంటాయి. కాని కొన్ని నగరాలలో ధీశాలురైన బాలుర

కోసం ప్రత్యేక పాఠశాలలు తరగతులు పూర్తికాల, అల్పకాల పద్ధతిపై నడుపబడుతున్నాయి.

వసతి సౌకర్యంగల ఇట్టి పాఠశాలల్లో ఈ ప్రత్యేక బాలురలో నూటికి 15 గురు ప్రత్యేక శిక్షణ పొందుతున్నారు. అంగవైకల్యంగల పిల్లలు, మిక్కిలి తెలివిగల పిల్లలు - వీరికోసం ఏదో ఒకరకం వసతి పాఠశాలా సౌకర్యం వుంది. రకరకాల అంగవైకల్యంగల పిల్లలకోసం వసతిసౌకర్యంగల చాలా వైయక్తిక పాఠశాల లున్నాయి. రాను రాను ఈ ప్రత్యేక విద్యార్థులకు ప్రత్యేక శిక్షణ ఈయటం దైనిక పాఠశాలా బాధ్యతగా గుర్తింపబడుతున్నది. సంయుక్త రాష్ట్రీయుల సరిహద్దు ప్రాంతము లందలి పెక్కు రాష్ట్రాలలో ఈ ప్రత్యేక విద్యానిర్వహణకై స్థానిక పాఠశాలలకు ధనసహాయం చేయబడుతున్నది.

## విద్యార్థి వ్యక్తి శిక్షణ :

దేశమంతటా వివిధ ప్రమాణాలలో విద్యావిధానాన్ని ప్రభావితం చేసిన ఒకానొక ప్రసిద్ధ సిద్ధాంతం మూలంగా మార్గదర్శకత్వం వ్యక్తి శిక్షణలకు అమెరికా విద్యావిధానంలో విపరీతమైన స్థానం వున్నది. అయితే దీని ఉద్దేశ్య మేమిటో ముందు అర్థంచేసుకోవటం అవసరం.

## కొన్ని ప్రాతిపదిక సూత్రాలు :

వ్యక్తులు తమ తమ ప్రయాణ మార్గాలను, అభివృద్ధి ప్రమాణాలను, గమ్యాలను ఏ విద్యాతరగతిలోనైనా సంస్కరించుకోగలిగినంత స్థాయిలో వైవిధ్యం కలిగివుంటా రనేది దీని మూలసూత్రం. ఏ వ్యక్తికిగానీ ఈ విభేదాలవల్ల అతని వ్యక్తిగత సంబంధాలలోనూ, శారీరక మానసికారోగ్యం లోనూ, విద్యలోనూ వృత్తిలోనూ-ఇంకా మరెన్నో విషయాలలో కొన్ని సమస్యలు ఉత్పన్నమవుతాయి. ఈ వ్యక్తి విభేదాలకు తోడు వాతావరణ విభేదాలుకలిస్తే, ఈ వైవిధ్యం అసంఖ్యాకంగావుంటుంది. ఇవన్నీ కేవలం

పాఠశాలా విద్యతో మాత్రమే పరిష్కరింపబడజాలవని కూడా గుర్తించబడింది.

ప్రతి విద్యార్థి పాఠశాలకు ఇంతవయస్సు వచ్చేదాకా, కొన్నిచోట్ల 18 ఏండ్లదాకా, హాజరుకావాలనే నిబంధన వుండటం వల్లనూ, ఆ యా వ్యక్తులలో ఉండే విభేదాలను వారి వారి వాతావరణాలను గమ్యాలను దృష్టిలోపెట్టుకొని వారి అవసరాలకు తగిన శిక్షణను పాఠశాల కల్పించి తీరాలనే సిద్ధాంతంవల్లనూ, ఈ సమస్య మరీ జటిలమైపోయింది.

ఈ అంశాలవల్ల మార్గదర్శకత్వమూ వ్యక్తిశిక్షణా అనే దాని కోసం అమెరికా విద్యావిధానంలో కొన్ని పరికరాలు కళలు పద్ధతులు నిర్వహణావకాశాలు ప్రవేశపెట్టబడ్డాయి. ఉపాధ్యాయులు ఈ కార్యక్రమం లోని ఆ యా ప్రత్యేక విభాగాల్లోను సాధారణ విధులలోను ఆ యా కార్య క్రమాల పర్యవేక్షణా నిర్వహణలలోను ప్రత్యేక శిక్షణ పొంది ఉంటారు.

## మార్గదర్శకత్వ వ్యక్తి శిక్షణలు : స్థానిక కార్యక్రమాలు :

ఈ రంగంలో తగినంత సేవచేసే ఏ పాఠశాలగానీ తన విద్యార్థులకోసం ఈ క్రిందిపనులు చేస్తుంది.

1. పరిశీలనద్వారా మానసిక పరీక్షలలో పిల్లల స్వభావాలను నిర్ణయించి, వాటిని రికార్డుచేస్తుంది. పాఠశాలా కాలమంతటా వారి అభివృద్ధి మొదలైన వానినిగూర్చిన రికార్డు తయారుచేస్తుంది.

2. ఈ విభేదాలను ఒకే ప్రాతిపదికమీద సమన్వయించే సావకాశం కల్గించి, ఈ పిల్లలు ఏమి నేర్చుకోగలరో ఏమి నేర్చుకోవలెనో. వారి పెంపులోనూ అభివృద్ధిలోనూ ఏయే లక్ష్యాలు గోచరిస్తాయో నిర్ణయిస్తుంది.

3. తరగతి విద్యవలన పరిష్కరింపబడని సమస్యలను ఆలోచించి, ప్రతి ఒక్క విద్యార్థికి సహాయపడటానికి అన్నివేళలా శ్రద్ధవహి

స్తుంది. పిల్లవాడు పెరిగినకొద్దీ తన విద్య వృత్తి మొదలైన విషయా లలో సొంతంగా నిర్ణయాలు చేసుకోవలసి వుంటుంది. అట్టి సమయా లలో అతనికి స్వవిషయ జ్ఞానం కలగటానికి అతని సమస్యలలోని అతని వ్యక్తి స్వభావాలను తెలియజెప్పి, అతనికి సహాయపడటం ద్వారాను, అతనియందు ప్రత్యేకశ్రద్ధ వహించి శిక్షణపొందిన సలహాదారు అత నితో సంప్రదించి, అతడు తనకు తగిన విద్యావృత్తులను ఎన్నుకొనేటట్లు చేయటం పాఠశాల విధి.

4. ప్రత్యేకించి ఒకానొక వ్యక్తియొక్క శక్తిసామర్థ్యాలనూ ఆశ యాలనూ అభిరుచులనూ దృష్టిలో పెట్టుకొని ప్రపంచమంతటా ఏయే బుద్ధి ప్రమాణాలలో ఎంతెంత పరిశ్రమమీద ఏ యే వృత్తులలో ప్రవేశించ టానికి అవకాశం వున్నదో విద్యార్థికి స్పష్టపరచటం.

5. వైద్యసహాయం, పనిలో నియమించటం, సాంకేతిక వృత్తి విద్యలలో ప్రవేశం కల్పించటం; తక్కిన తోడ్పాటు మామూలు పాఠ శాలా విద్యకు తోడుగా విద్యార్థి అభివృద్ధికీ అనుకూలానికీ వివిధ విధాల సహాయం చేయటం.

ఉన్నత పాఠశాలలలో పాఠశాల సలహాదారు అనే అధికారి ఈ కార్యక్రమంలోని సాంకేతి కాంశాలను నిర్వహిస్తాడు; ఒక్కొక్క వ్యక్తికీ అనుభవపూర్వకమైన సలహాలిస్తాడు. పాఠశాలోపాధ్యాయులు తమ విధి నిర్వహణలో ఆ సలహాలను వినియోగించుకొనేటట్లు చూస్తాడు; ఈ లక్ష్యసాధనలో పాఠశాలేతర సంస్థలతో సహకారం నెరపు తాడు; ఈ వ్యక్తి సాంకేతిక విద్యావేత్త మాత్రమేకాక, ఈ విషయాలలో పాఠశాలా నాయకుడుగా వుంటాడు. 250 నుంచి 300 మంది విద్యార్థుల వరకు ఒక సలహాదారుక్రింద వుంటారు, పాఠశాలా ప్రయోజన సాధన లోని ప్రతి దశలోనూ ఈ సూత్రాలు వర్తిస్తాయి. కనుక పాఠశాలయందలి ఉపాధ్యాయులందరూ మార్గదర్శకత్వ వ్యక్తి శిక్షణలలో కొంత కొంత పాల్గొంటారు.



క్రీడా రంగంలో

## ఈ కార్యక్రమంయొక్క ప్రస్తుత స్థితి :

ఉన్నత పాఠశాలలలో, చాలాభాగం - అరింటి ఒకపాలు, సుశిక్షితులైన సలహాదారులనూ, ఈ కార్యక్రమం తాలూకు సహాయక సౌకర్యాలనూ కలిగివుంటాయి. ఇట్టివి సామాన్యంగా పల్లెలోకంటె పట్టణాలలోనే వుంటాయి. ప్రాథమికోపాధ్యాయుల శిక్షణలో కూడా ఈ సూత్రాలు పాటింపబడతాయి. ప్రస్తుతం సలహాదార్లు అనబడే ఈ ప్రత్యేకోద్యోగులు చాలాకొద్ది ప్రాథమిక పాఠశాలలో మాత్రమే వున్నారు. మనస్తత్వవేత్తలూ పరిశీలకోపాధ్యాయులూ శారీరక మానసికారోగ్య

వేత్తలూ తరచు పాఠశాలకు వచ్చి ఆ యా సమస్యలలో తోడ్పడుతూ వుంటారు. ఉన్నత విద్యాస్థాయిలో ఈ మార్గదర్శకత్వ వ్యక్తిశిక్షణలు అనేవి వివిధ నామాలతో చాలా ఉన్నత పాఠశాలలలో ఉన్నాయి. వీనినే సామాన్యంగా విద్యార్థి వ్యక్తిశిక్షణా సంస్థ లంటారు. ఇవే సూత్రాలు కళాశాలా విద్యార్థుల వయః ప్రమాణానికీ, అవసరాలకూ, స్వభావాలకూ తగిన మార్పులతో అనువర్తింప జేయబడతాయి.

ఈ మార్గదర్శకత్వవ్యక్తి శిక్షణలు ఏ బడికీ ఎన్నడూ రాని పెద్దలకుకూడా చాలాచోట్ల అందుబాటులో ఉన్నాయి. ఈ సహాయం పలు సంస్థలద్వారా చేయబడుతున్నది.

## మార్గదర్శకత్వ వ్యక్తిశిక్షణలు శిక్షణ - ప్రమాణాలు :

అమెరికాలో 1000 కంటె ఎక్కువ ఉన్నత విద్యాసంస్థలలో ఈ కార్యక్రమ నిర్వహణకు శిక్షణ గరపబడుతుంది. కొద్ది కళాశాలలలో విశిష్టశిక్షణ ఈయబడుతుంది. ఇక్కడ శిక్షణ పొందినవారు పట్టభద్రులవుతారు. దాదాపు 20 రాష్ట్రాలలో ప్రభుత్వ ధనసహాయంతో పాఠశాలా సలహాదార్ల శిక్షణ గరపబడుతున్నది. వారి కా యా ప్రాంతాలలో పని అప్పగిస్తారు. ఈ విషయంలో దేశ వ్యాప్తంగా అనేక విజ్ఞ సమాజాలు కూడా పరిశోధనలు సాగిస్తున్నాయి.

## నిర్మాణము - నిర్వహణ - పర్యవేక్షణ:

మార్గదర్శకత్వ వ్యక్తి శిక్షణాప్రాంతంలోనూ పరికరాలలోనూ పద్ధతులలోనూ పరిశోధనలలోనూ పరిగణనలోనూ మాత్రమేగాక కేంద్ర వృత్తి విద్యాచట్టాలక్రింద ప్రభుత్వ స్థానిక కార్యక్రమ నిర్వహణకోసం కేంద్ర ధనసహాయం లభిస్తున్నది. రాష్ట్రాలకు తోడ్పడటంలో గూడా కేంద్రప్రభుత్వ విద్యా శాఖోద్యోగులు బాధ్యత వహిస్తున్నారు. చాలా కేంద్రసంస్థలూ, సైనికవర్గాలూ మార్గదర్శకత్వ వ్యక్తిశిక్షణ సూత్రాలను

తమ కార్యక్రమాలలో అన్వయించుకొని ప్రత్యక్షంగానూ పరోక్షంగానూ ఆ యా వ్యక్తులకు తోడ్పడుతున్నాయి. ఇలాంటి సంస్థలలో వృత్తి పునరుద్ధరణ కార్యాలయం, ఉద్యోగ భద్రతాసంస్థ ముఖ్యమైనవి.

40 కి మించిన రాష్ట్రీయ విద్యాశాఖలలో ప్రతిఒక్క దానిలోనూ ఈ మార్గదర్శకత్వ వ్యక్తి శిక్షణలకుగాను ఒక ప్రత్యేకోద్యోగి ఉన్నాడు. కొన్నిరాష్ట్రాల వివిధ విధి బాధ్యతలకు అనేకోద్యోగు లున్నారు.

ఒక పాఠశాలసంస్థ మార్గదర్శకత్వ వ్యక్తిశిక్షణాధికారిని ఒకరిని నియమించవచ్చు. ఆ సంస్థక్రింద ఉన్న ప్రతి బడియందలి పరిస్థితులను పరికించి అతడు వాటి అభివృద్ధికి దోహదం చేస్తాడు.

వ్యక్తులమధ్య ఉండే విభేదాలకు ఎంత ప్రాముఖ్యం ఇవ్వబడుతున్నదో గమనించకుండా అమెరికా విద్యారంగాన్ని అర్థంచేసుకోవటం అసాధ్యం. ఈ కార్యక్రమంవల్ల ప్రత్యేక ప్రయోజనాలకు సుశిక్షిత ఉద్యోగులకు-పెరుగుతున్న దేశీయావసరాలను బట్టి - ఆ యా విధి నిర్వహణలో విస్తృతావకాశాలు లభించాయి. కాని ఇది సర్వేసర్వత్ర ఒక విధంగాలేదు. మార్గదర్శకత్వ వ్యక్తిశిక్షణలు ప్రాథమిక పాఠశాలనుంచి బడివదిలే పర్యంతం వుంటుంది. ఆ తర్వాత పెక్కు పారిశ్రామిక, సైనిక, సాంఘిక, ఆర్థిక సంఘాలద్వారా కూడా ఈ కార్యక్రమం నిర్వహింపబడుతున్నది. సుప్రతిష్ఠితములైన వృత్తిసంఘాలు, కేంద్రరాష్ట్ర స్థానికసంస్థలు ఈ ఉద్యమాన్ని అభిమానించి దీని అభివృద్ధికి సహాయపడుతున్నాయి.

## విస్తృత విద్యాలయ కార్యక్రమం :

వివిధ విస్తృత విద్యాలయాలు: పిల్లలూ తమ తీరిక కాలాన్ని నిర్మాణాత్మకంగా వినియోగించుకోవటానికి సహాయపడటంకోసం బడివేళ తర్వాత కొన్ని గంటలపాటూ, శనివారాల్లోనూ, ఎండాకాలంలోనూ ప్రత్యేక కార్యక్రమాలు నిర్వహించటంద్వారా ఆధునిక పాఠశాలలు తోడ్పడుతున్నాయి. దూరప్రదేశాలలో ఉద్యోగాలలో ఉన్న తలిదండ్రుల

పిల్లలకు ఈ విధమైన కార్యక్రమం చాలా సందర్భాలలో అవసరమైంది. పట్టణాలలోని ఇరుకు ప్రాంతాలలో నివసించే విద్యార్థులకు, సహజీవనానికీ విశ్రాంతికీ తగిన అవకాశాలు కల్పించటంకోసం, పాఠశాలోద్యోగుల పర్యవేక్షణక్రింద బడి భవనాలూ పరికరాలూ వినియోగింప బడుతున్నాయి. బడివదలిన పిదప ఒకటి రెండు గంటలపాటు గానీ, వేసవిలో ఆరునుండి పదివారాలపాటుగానీ. ఆటలూ చేతిపనులూ నాటకాలూ సంగీతం చిత్రకళ మొదలైన సృజనాత్మక వ్యాపృతులకు అవకాశం కల్పించటంకోసం ఈ కార్యక్రమం ఏర్పరచబడింది.

ఇంకొక రకం కార్యక్రమం శిశుశాలలు, క్రీడా సంఘాలు, బాలానంద కేంద్రాలు నెలకొల్పటంద్వారా చిన్నపిల్లలకు మేలు చేకూర్చుతుంది. పిల్లల అభివృద్ధి విషయంలో శాస్త్రీయ విజ్ఞానంనుంచి లాభం పొందవలెననే తల్లిదండ్రుల ఆదుర్దావల్లనే ఈ శిశు కార్యక్రమాలు వృద్ధి పొందుతున్నాయి. తల్లిదండ్రులచేత ప్రారంభింపబడిన శిశుశాలలు గృహధర్మాన్ని పెంపొందించి, పసిపిల్లల శారీరక మానసికాభివృద్ధికి అవసరమైన మంచి వాతావరణాన్ని కల్పిస్తున్నాయి.

## ప్రోత్సాహం :

విస్తృత విద్యానిర్వహణకై స్థానిక పాఠశాలలకు కొద్దిరాష్ట్రాలు మాత్రమే ధనసహాయం చేస్తున్నప్పటికీ, బడిగంటలు పెంచి పెద్ద వయస్సువారిని చేర్చుకొనటంద్వారా ఏడాది పొడుగునా జరిపే కార్యక్రమాలకు అన్ని రాష్ట్రాలూ ప్రోత్సాహమిస్తున్నాయి. ద్వితీయ ప్రపంచ సంగ్రామకాలంలో పనిపాటుల్లో ఉన్న పిల్లలకోసం కేంద్రసహాయంతో ఏర్పరచబడిన కేంద్రాలుకూడా గృహ జీవితాన్ని సంరక్షించి బలవత్తరం చేశాయి. అంతేగాక దేశమంతా ఆత్మరక్షణకోసం సమీకృతం అయినప్పుడు. పిల్లలకు విస్తృతంగా విద్యనేర్పటం అత్యవసర జాతీయపరిస్థితులను ఎదుర్కొనటంలో ఒకప్రధాన చర్యగా పరిగణింప బడింది.

తండ్రులు ఇళ్ళకు దూరంలో ఎక్కడో యుద్ధరంగాలలో నుండగా, తల్లులలో చాలామంది పరిశ్రమల్లో ప్రవేశించారు. కుటుంబాలు వలసపోతూ, లేదా ఇరుకు ప్రాంతాల్లో తలదాచుకొంటూ ఉన్న రోజుల్లో పిల్లలకు చక్కని జీవిత వాతావరణం కల్పించటానికి ప్రత్యేక సేవాకార్యక్రమం అవసరమైంది. సమాజాన్ని పిల్లలకు నివాసయోగ్యమైన చక్కనిస్థానంగా తీర్చిదిద్దే కార్యక్రమాలలో తల్లిదండ్రులూ ఉపాధ్యాయులూ పౌరులూ సహకరిస్తారు.

## సందర్శకోపాధ్యాయులు :

ప్రతి పిల్లవానికీ అవసరమైన పాఠ్యానుభవం కలిగించటమే ఆధునిక పాఠశాలల లక్ష్యం. ఆ యా తరగతులలో నున్న ప్రతిఒక్క విద్యార్థికీ అవసరమైన వ్యక్తిగత సహాయం అందజేయటం ఒక్కొక్కప్పుడు ఆ ఉపాధ్యాయునికి సాధ్యంకాదు. పాఠశాల కల్పించే అవకాశాలను సద్వినియోగం చేసుకోజాలని సమస్యలుగల పిల్లలు ప్రతి పాఠశాలలోనూ కొందరైనా వుంటారు. ఇలాంటి ఇబ్బందులవల్ల వారు ఆ యా పాఠ్యాంశాలలో తప్పిపోతూ వుంటారు. ఒకరిమీద పెత్తనం చేద్దామనే బుద్ధికలిగి, సంఘంమీద జుగుప్స వృద్ధికావచ్చు. పిన్నలకూ పెద్దలకూ దూరమై, బడి విడిచిపెట్టి, అనారోగ్య లక్షణాలు పెంపొందించుకోవచ్చు.

అలాంటి పిల్లలు తమ పరిస్థితులను సరిదిద్దుకోవటంలో తోడ్పడటానికి ప్రతిపాఠశాలలోనూ ఒక సందర్శకోపాధ్యాయుడు గానీ, పాఠశాల సలహాదారుగానీ ఉంటాడు. ఈ విషయంలో ఆ ప్రత్యేకోద్యోగి పాఠశాలలో కష్టాలపాలైన ఆ పిల్లవానితోను, అతని తల్లిదండ్రులతోను ఉపాధ్యాయులతోను, ప్రధానోపాధ్యాయునితోను, నర్సుతోను, సహకరించి కృషిచేస్తాడు. ఆ పిల్లవాణ్ణి, వాడికుటుంబ సంప్రదాయాలనూ ఎరిగినవారుకూడా అతనికి తోడ్పడుతారు.

## సేవా విస్తరణ :

సందర్శకోపాధ్యాయులు తప్పనిసరిగా ఉండాలనే నిబంధన ఈ క్రొత్త దృక్పథం ఫలితంగా ఏర్పడింది. బడిపిల్లలకు గల ఇబ్బందులను అర్థంచేసుకోవటం వల్ల, వాటి నివారణకు మార్గాలు వెతకటం సాధ్యపడుతున్నది.

ప్రభుత్వ పాఠశాలల్లో ఇచ్చే మార్గదర్శకత్వ వ్యక్తిశిక్షణలు పలు విధాలుగా వుంటాయి. 10 వేల మందికి పైబడిన నగరాలలో సాధారణంగా ఆ యా పాఠశాలోద్యోగులలో ఒక సందర్శకోపాధ్యాయుడు ఉంటాడు. ఇటీవలి లెక్కల ప్రకారం ఈ కార్యక్రమంలో సత్వరాభివృద్ధి కానవస్తున్నప్పటికి, సుశిక్షితులైన సందర్శకోపాధ్యాయులు తగినంత మంది లేకపోవటంవల్ల వారి సహాయం అంతగా లభ్యంకావటంలేదు. ఒక సందర్శకోపాధ్యాయునికి ఉపాధ్యాయ శిక్షణ, పాఠశాలానుభవం, సాంఘిక కార్యక్రమాలలో ప్రత్యేక యోగ్యత ఉండాలి.

## రాష్ట్ర కార్యక్రమాలు :

సందర్శకోపాధ్యాయ కార్యక్రమాలను రాష్ట్రవ్యాపితంగా నెలకొల్పుతూ ఆరురాష్ట్రాలు చట్టాలు చేశాయి. లభ్యములైన రాష్ట్రప్రభుత్వ నిధులతో స్థానికపాఠశాలలు తమ ఉద్యోగివర్గంలో ఒక సందర్శకోపాధ్యాయుని నియమించుకొంటున్నాయి. క్రమంగా హాజరు ఉద్యోగిని తొలగించి, అతని స్థానంలో పిల్లల మానసిక, సాంఘిక, సమన్వయానికి సంబంధించిన సమస్యలను అర్థంచేసుకోవటంలో శిక్షణపొందిన ఉద్యోగులను నియమిస్తారు.

## తల్లి దండ్రులు - విద్య :

ఉపాధ్యాయులు తల్లిదండ్రులు కలిసి మెలసి కృషి చేయకపోతే, పాఠశాలలు ఒక పిల్లవానికి విజయవంతంగా విద్యాబోధన చేయజాలవని ఆధునికుల ఉద్దేశ్యం. పాఠశాలా కార్యక్రమంలో తల్లి దండ్రులు పాల్గొ



గ్రంథాలయంలో

న్నప్పుడు తమ పిల్లలు ఏమి నేర్చుకొంటున్నారో, వారికి తా మెలా సహాయపడవచ్చునో తెలుస్తుంది.

ఇంటికీ బడికీ నడుమ మంచి సంబంధాలు నెలకొల్పడం కోసం చాలా పాఠశాలలు తల్లిదండ్రుల విద్యా కార్యక్రమాలను పెంపొందించాయి. అసలు తల్లిదండ్రులకే ఈ విషయాలలో ఆసక్తి వుంది; అంతే కాక తమ పిల్లల పెంపునూ అభివృద్ధినీ గురించిన అంశాలను తెలిసికొని లాభంపొందాలనే కోరికా వుంది. అందువల్ల ఈ కార్యక్రమాలు మిక్కిలిగా వ్యాపించాయి. అధ్యయన తరగతులు, పాఠశాలా సక్రమ పరిశీలన, సామాజిక కేంద్ర సందర్శనం తల్లిదండ్రుల ఉపాధ్యాయుల సమావేశాలు,

సంఘ సేవ ఫలితాలు ప్రదర్శనాలు, అభివృద్ధి పట్టికలు మొదలైన పాఠశాలా కార్యక్రమాన్ని తెలిపే బహువిధ వ్యవహారాలు వంటి సంగతులు తెలుసుకోటానికి పాఠశాలలు తలిదండ్రులకు అవకాశాలు కల్పిస్తాయి. మామూలుగా ఉపాధ్యాయులందరూ తలిదండ్రులతో కలిసి కృషిచేసే బాధ్యత వహిస్తారు. అయినప్పటికీ పెద్ద పాఠశాలా సంస్థలో తలిదండ్రుల విద్యాసలహాదారుగానీ, గృహ్యపాఠశాలా సంబంధ సమన్వయకర్త గానీ ఉంటాడు. తలిదండ్రులతో కలిసి పనిచేసే సామర్థ్యాన్ని పెంచుకోవటంలో, ఉపాధ్యాయులకూ మామూలు నాయకులకూ శిక్షణ ఇవ్వటంలో సమాజ నాయకులకు ఆ ఉద్యోగి తోడ్పడుతాడు. తలిదండ్రుల ఉపాధ్యాయుల సంఘాలకు వృత్తి సంబంధమైన సలహాలిస్తాడు.

న్యూయార్క్, కాలిఫోర్నియా - అనే రెండు రాష్ట్రాలు తల్లిదండ్రులతో ప్రయోజనకారులైన కార్యక్రమాలను ఆచరించటంలో స్థానిక పాఠశాలలకు తోడ్పడేందుకు, రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖలో ప్రత్యేకమైన తల్లిదండ్రుల విద్యావిభాగాన్ని నెలకొల్పాయి. తక్కిన రాష్ట్రాలు తల్లిదండ్రుల విద్యను శిశువిద్యా కార్యక్రమంతో జోడించాయి.

## పాఠశాలలు - ఆరోగ్య సౌకర్యాలు :

పిల్లలకు యువకులకు పెద్దలకు సంపూర్ణమైన, ఆరోగ్యకరమైన భద్రమైన విధంగా జీవించటంలో తోడ్పటటం తమబాధ్యత అని అమెరికా పాఠశాలలు నానాటికీ గుర్తించి అంగీకరిస్తున్నవి. పాఠశాలోద్యోగులు ప్రజారోగ్య రంగంలోను, వైద్యరంగంలోను, తక్కిన ఆరోగ్య వృత్తులలోను పనిచేస్తున్న ఉద్యోగులతో కలిసి ఆరోగ్య విద్యాకార్యక్రమాల అభ్యుదయానికి కృషి చేస్తున్నారు.

వ్యక్తుల ఆరోగ్యస్థాయిని నిర్ణయించటానికీ, పిల్లలు తమ చక్కని ఆరోగ్యస్థాయిని నిలబెట్టుకొనేటట్లు పురికొల్పేందుకు తగు చర్యలు తీసుకోటానికీ, నయమయ్యే లోటుపాట్లను సరిచేయ

టానికీ, సరియైన పరిస్థితులు సమకూర్చటానికీ, వైద్య - దంత వైద్య - పరిపోషకాది ఆరోగ్యసంస్థల విషయంలో సరియైన దృక్పథాన్ని పెంపొందించటానికీ ఈ ఆరోగ్య కార్యక్రమం ఉద్దేశింపబడింది.

## వైద్య - దంతవైద్య - పరీక్షలు :

బాలబాలికలకు సమగ్రమైన వైద్య - దంతవైద్య పరీక్షలు జరిపించటానికి కృషి జరుగుతున్నది. ఈ పరీక్షలకు చాలాకాలం పడుతున్నది. కాని అవకాశాలు తక్కువగా ఉన్నచోట్ల మాటిమాటికీ పరీక్షించటం మానివేసి, ఏడాది కొక్కసారియైనా సమగ్రంగా పరీక్షించటం మంచిదనే భావం ఉన్నది. అమెరికా పాఠశాలల్లో ప్రతి విద్యార్థి బడిలో చేరిన వెంటనే ఒక పర్యాయమూ, అటుపిమ్మట అతని ప్రాథమిక - ఉన్నత పాఠశాలా కాలంలో దాదాపు మూడు పర్యాయాలూ, వైద్యపరీక్ష చేయవలసి వుంటుంది. బడిలో అభివృద్ధి చూపక పోవటాన్నిబట్టీ, ఇతర కారణాలనుబట్టీ, ఒక పిల్లవానికి ఇంకా ఎక్కువ పరీక్షలు అవసరమని పరిశీలన వలన ఉపాధ్యాయులు తలచినపుడు, అట్టి అవకాశం కల్పింపబడుతుంది.

మామూలుగా ఆటలపోటీలలో పాల్గొనే ఉన్నత పాఠశాలా, కళాశాలా విద్యార్థులకు పోటీలలో పాల్గొనేముందుగానీ - ఇలా పాల్గొనబోయే ప్రతిసారీ లేదా ఏడాదిలో తొలిసారీ - వైద్యపరీక్ష చేయించటానికి సాధారణంగా కృషి జరుగుతున్నది.

## ఉపాధ్యాయుల పరిశీలన :

ప్రతిదినం పిల్లవాణ్ని చూస్తూ, అనేక పరిస్థితుల్లో అతన్ని పరిశీలిస్తూ వుండే ఉపాధ్యాయుడు అతని ఆరోగ్యావసరాలను గురించి చక్కగా తెలుసుకొనే అవకాశం వుంది. ప్రాథమిక పాఠశాలలలోని ఉపాధ్యాయులు

పిల్లల ఆరోగ్యాన్ని కనిపెడుతూ ప్రత్యేక పరిస్థితుల్ని గమనించి, ఒక నివేదిక తయారుచేయవలసి వున్నది.

చాలామంది ఉపాధ్యాయులు పాఠశాల నర్సుయొక్కగానీ, ప్రజారోగ్యశాఖ నర్సుయొక్కగానీ సహాయంతో ఈ పరిశీలన సాగిస్తారు. అప్పుడప్పుడు విద్యార్థి ఎత్తు బరువు మొదలైన కొలతలు కొలిచి, అతని చూపునూ వినికిడినీ పరీక్షిస్తారు. అతని ఆరోగ్యాన్ని గురించిన సాంకేతికేతర పరిశీలనలుకూడా జరుపుతారు. కాని వారు రోగ నిర్ధారణ చేయరు. ఏ యే విద్యార్థులను వైద్యునకుగానీ ఆరోగ్యశాఖోద్యోగికిగానీ చూపవలెనో నిర్ణయిస్తారు. ఆ వైద్యుడు ఉపాధ్యాయుల పరిశీలన సహాయంతో పిల్లలను పరీక్షించి, రోగనిర్ణయం మొదలైనవి చేస్తాడు.

## చికిత్స :

వైద్యులచేత దంతవైద్యులచేత పిల్లలను పరీక్షింపజేసి, నర్సులచేత ఉపాధ్యాయులచేత పరిశీలింపజేసి, వారి నిర్ణయాలను పాఠశాలలు పాటిస్తాయి. లేకపోతే ఈ చేసిన పని అంతా నిరర్థకమే అవుతుంది. కనుక అనారోగ్యవంతులైన పిల్లలకు చికిత్స చేయించవలసిందిగా పాఠశాలలూ, తదితర ఆరోగ్యసంస్థలూ వారి తల్లిదండ్రులను కోరుతాయి. తల్లిదండ్రులు నిరుపేదలైన పక్షంలో, ఆ పిల్లలకు తగు చికిత్స చేయించటానికి తామే పూనుకొంటారు.

## ఆరోగ్యసంస్థలు :

కొన్ని ఆరోగ్యసంస్థలు ఈ క్రింది కార్యక్రమాలను నిర్వహిస్తున్నాయి :

1. దంతాలు పుచ్చకుండా చూడటంకోసం పిల్లల దంతాలకు సోడియం ఫ్లోరైడ్ పూయటం, లేదా, వారు త్రాగే నీటిలో సోడియం ఫ్లోరైడ్ కలపటం.



పిల్లలకు చిత్రలేఖనా బోధన

2. దృష్టిలోపంగల పిల్లలను పరీక్షించి రోగ నిరూపణచేసి, చికిత్స చేయించటం.

3. చెవుడు వచ్చిన పిల్లలను పరీక్షించి రోగ నిరూపణచేసి, చికిత్స చేయించటం.

4. బడివయస్సు పిల్లలకు సామూహికంగా వచ్చే ప్రత్యేకమైన ఆరోగ్య సమస్యలను పరిష్కరించటం.

## ఆరోగ్య సమస్యలపై సలహా :

ఆరోగ్యసంస్థలు ఇచ్చిన సమాచారాన్నిబట్టి తగిన బల్లలు, విశ్రాంతి సమయాలు, అనుకూలమైన శారీరక పరిశ్రమ మొదలైన పిల్లి

లకు కావలసిన ఏర్పాట్లు ఆ యా పాఠశాలలలో చేయపడతాయి. ఉపాధ్యాయులకు - ఆరోగ్య పరీక్షల ద్వారాను, నర్సుల పరిశీలన, పిల్లవాని ఆరోగ్యచరిత్ర, తమసొంత పరిశీలన, తక్కిన అనేక ఆరోగ్య సంస్థల పరిశీలనల ద్వారాను,—ఒక విద్యార్థిని గూర్చిన సమాచారం తెలుస్తుంది. అప్పుడు ఆ విద్యార్థికి వ్యక్తిగతంగా అవసరమైన తీరున ఆరోగ్య శాస్త్రం బోధించవచ్చు. పిల్లవానియొక్క బలం ఎక్కడ వున్నదో, అతని ఆరోగ్యావసరాలు ఏమిటో, అతడు అవలంబింపవలసిన ఆరోగ్యమార్గమేమిటో అతనికి తెలియజెప్పి, దారిచూపటానికి ఉపాధ్యాయులకు పై పరిశీలనలన్నీ తోడ్పడుతాయి.

## ఆరోగ్యకర వాతావరణం :

దేశమంతటా నూతన పాఠశాలా భవనాలు ఇప్పుడు నిర్మాణంలో ఉన్నాయి. వీని ఆకార నిర్మాణాలలో ఆరోగ్యకరమైన, భద్రమైన, సుకరమైన జీవితానికి కావలసిన పెక్కు లక్షణాలు ఇమడ్చబడి వున్నాయి. పిల్లల సంఖ్యతోపాటు బడి భవనాలు పెంపొందక పోవటంవల్ల చాలా పాఠశాలల్లో అతి సమర్దమూ అనారోగ్యకర పరిస్థితులూ వున్నాయి.

పలుచోట్ల, పాఠశాలా వాతావరణ పరిస్థితులను అభివృద్ధి పరచటానికై, పాఠశాలా పరిపాలకులు, ఉపాధ్యాయులు, పారిశుధ్య శాఖోద్యోగులు, తక్కిన రాష్ట్రీయ స్థానిక ఆరోగ్యసంస్థలు కలిసి కృషిచేస్తున్నారు.

## ఆరోగ్యకర పాఠశాలా జీవితం :

చాలా పాఠశాలల్లో, ముఖ్యంగా ప్రాథమిక పాఠశాలల్లో, ఉపాధ్యాయులయొక్క, పిల్లలయొక్క మానసికారోగ్యం శ్రద్ధగా పరిశీలింపబడుతుంది. మరింత చక్కని మానవ సంబంధాల ఆవశ్యకత ఉద్ఘాటించబడుతుంది. ఇంటిపని అభ్యాసాలు తరగతి విభజన ఉత్తీర్ణత మొదలైన సాంప్రదాయకాలైన ఆచారాలు పునః పరిశీలింప బడుతున్నాయి.

## ఆరోగ్య విద్య :

పిల్లలు ఇంట్లో బడిలో సమాజంలో ఆరోగ్యకరంగా జీవించే పద్ధతులను తెల్పే ప్రత్యేకానుభవాలను వారికి అందజేయటం ద్వారా, మొత్తంమీద సంయుక్త రాష్ట్రాలలోని ప్రస్తుత పాఠశాలలు మంచి అభివృద్ధినే సాధిస్తున్నాయి. పిల్లలు, ఆరోగ్యాన్ని గురించిన అనారోగ్యాన్ని గురించిన సరియైన సమాచారంమీద ఆధారపడి తమ ఆరోగ్యాభ్యాసాలను కొనసాగించుకోటానికి తమయొక్క ఇతరులయొక్క ఆరోగ్యానికి తామే బాధ్యత వహించటానికీ పాఠశాలలు ప్రోత్సహిస్తున్నాయి,

ఇప్పుడు చాలా ఉన్నత 'పాఠశాలల్లో ఆరోగ్యవిద్య' ప్రత్యేక తరగతులు నడుపబడుతున్నాయి. ఇదివరలో ఈ పాఠశాలల్లో ఆరోగ్యం తక్కిన పాఠ్యాంశాలలో కలిపివేయబడేది. లేదా - శరీర పరిశ్రమతో గానీ, తక్కిన అంశాలతో గానీ కలిపి బోధింపబడేది. ఈ అలవాటు ఇంకా చాలా పాఠశాలల్లో వుంది.

ఆరోగ్యబోధన కవసరాలైన ఉపకరణాలు నానాటికీ అధికంగా సమకూర్పబడుతున్నాయి. వివిధ తరగతుల పాఠ్యగ్రంథాలు, ఫిల్ములు, పటాలు, నమూనాలు, కరపత్రాలు ప్రతి పాఠశాలలో విరివిగా సమకూర్పబడుతున్నాయి.

నానాటికీ ఎక్కువ పాఠశాలలు మానసికారోగ్యాన్ని గురించీ, సెక్సు విద్యలుగురించీ, శిక్షణ ఇస్తున్నాయి. ఈ కార్యక్రమాలు చాలా విజయవంతంగా కన్పిస్తున్నాయి. ఇవి తల్లిదండ్రులను తక్కిన సమాజ సభ్యులను వీని యోజనలోనికి ఆకర్షించి, వారి సహాయ సహకారాలను పొందుతున్నాయి.

శారీరక పరిశ్రమయొక్క, బాలుర యువకుల సాంఘికమానసికాభ్యుదయంలోని పునరజ్జీవనంయొక్క ప్రాముఖ్యం అంతకంతకూ గుర్తింపబడుతున్నది.

## పాఠశాలా - సమాజ - ఆరోగ్య కార్యక్రమ సమన్వయం:

రాష్ట్ర - స్థానిక సహకారం : పాఠశాలయొక్క ఆరోగ్య కార్యక్రమ నిర్వహణ విధానంలో వైవిధ్యం వుంటుంది. కొన్ని ప్రాంతాలలో ప్రధానంగా పెద్దబస్తీ కేంద్రాలలో - పాఠశాలా నిర్వహకులు వైద్యులనూ నర్సులనూ తక్కిన ఆరోగ్య పరివారాన్ని నియమిస్తారు. తక్కిన పట్టణాలలోనూ, చాలా పల్లెప్రాంతాలలోనూ స్థానిక ఆరోగ్యశాఖవారే ఈ కార్యక్రమం నిర్వహిస్తారు. చాలావరకు పాఠశాలల్లోని ఆరోగ్య కార్యక్రమం రోగాలను అరికట్టేదిగా మాత్రమే వుంటుంది. కొన్ని కొన్ని విద్యా సంస్థలలో కొద్దిపాటి చికిత్సా సౌకర్యాలు కూడా వుంటాయి. సామాన్యంగా దరిద్రుల పిల్లలకు పళ్ళజబ్బులు నయంచేయటం వరకు మాత్రమే ఇవి పరిమితమై వుంటాయి. ఇటీవల కొద్దిరాష్ట్రాలు, తమ విద్యాశాఖలద్వారా దరిద్రులకు దంతచికిత్సకోసం, వైద్యచికిత్సకోసం, స్థానిక సంస్థలకు కొంత ధనసహాయం చేశాయి. ఈ నిధులు రాష్ట్రీయ స్థానిక ప్రజాసంక్షేమ శాఖలు, మాతా శిశు ఆరోగ్య కేంద్రాలు, వికలాంగ సహాయక సంస్థలు. రాష్ట్రస్థానిక ఆరోగ్యశాఖలు, ఇతర ప్రభుత్వ సంస్థలు దరిద్రుల చికిత్సకోసం చేసే సేవకు సహాయకరంగా వుంటాయి.

ఇటీవలి సంవత్సరాలలో ఈ కార్యక్రమాల మధ్య సమన్విత సాధించి, ఒకరుచేసిన దానినే మరొకరు చేయకుండా వారించటానికి తోడ్పడేందుకు ప్రత్యేకాధికారులను నియమించారు. దాదాపు అన్ని రాష్ట్రాలలోను చాలా పురపాలక సంఘాలలోనూ ఆరోగ్య విద్యను గూర్చిన ఒక అంతశ్శాఖా సంఘం ఏర్పరుపబడింది. అటువంటి సమితులలో ఆరోగ్య, విద్యా, ప్రజాసంక్షేమ తదితర శాఖల ప్రతినిధులు సభ్యులుగా వుంటారు.

పౌర ప్రతినిధులు పాఠశాలోద్యోగులు ఆరోగ్య శాఖవారు వైద్యులు దంతవైద్యులు తల్లిదండ్రులు, సభ్యులుగాగల సమాజారోగ్య సంఘాలు

సత్వరాభివృద్ధి చెందాయి. ఈ సంఘాలలోని సభ్యులు స్థానిక పాఠశాలా సమాజారోగ్య సమస్యలను పరిష్కరించటానికి, ఆరోగ్య భద్రతలకు హానికల్గించే పరిస్థితులను చక్కదిద్దటానికి, కలిసిమెలిసి పనిచేస్తాయి. ఈ సంస్థలు సమాజ సమస్యలన్నిటిమీదా పనిచేసే ఒకపెద్ద సంస్థకు అనుబంధంగా వుంటాయి. చాలా పాఠశాలల్లో అలాంటి సంస్థ ఒకటి సహకార దృష్టితో పాఠశాలా పరిసరారోగ్య సమస్యపై పనిచేస్తూ వుంటుంది.

## విద్యాలయ గ్రంథాలయం :

ప్రాథమిక పాఠశాలలలోను ఉన్నత పాఠశాలలలోను గ్రంథాలయాలు ఒక ప్రధాన భాగంగా వుంటాయి. పాఠశాలా గ్రంథాలయాలు సంఖ్యలోను ప్రాముఖ్యంలోను సత్వరాభివృద్ధి చెందుతున్నాయి. విద్యాశాఖవారి లెక్కల ప్రకారం కేంద్రీకృత గ్రంథాలయాలు కనీసం 28 వేల దాకా వున్నాయి. వీటిలో 5 కోట్ల గ్రంథాలు, 44 వేల తరగతి పుస్తకాలూ వున్నాయి,

ప్రాథమిక పాఠశాలా గ్రంథాలయంలో పిల్లలకు విజ్ఞానం పెంపొందించే వస్తువులూ, కళానుభవాన్నీ వాస్తవ సమాచారాన్నీ తెలిపే బొమ్మల పుస్తకాలూ, చదివి చాలా తెలిసికోవాలనుకొనే పిల్లల ఆసక్తిని తీర్చగలిగిన సులభ గ్రాహ్యములైన అనేక పుస్తకాలూ అందుబాటులో వుంటాయి. స్వీయచరిత్ర, చరిత్ర, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం మొదలైన అంశాలమీది గ్రంథాలు వారి పాఠ్యక్రమాన్ని మించివుంటాయి. వీటిలో చాలాభాగం పెద్దస్థాయిలో వుండి, పిల్లల అభిరుచులకు అందుబాటులో వుంటాయి.

గ్రంథాలయంలోని పుస్తకాలూ, వస్తువులూ వర్గీకరింపబడటం వల్ల, గ్రంథపట్టిక వల్ల, ప్రాథమిక పాఠశాలల్లోను ఉన్నత పాఠశాలల్లోను పిల్లలు ఆ గ్రంథాలయాలను తమంత తామే ఉపయోగించుకోగలరు.

సాధారణ గ్రంథాలయ విధులు చిన్న పిల్లలకు తేలికగా అవగత మవుతాయి. తమ వ్యక్తిగతాభిరుచులను బట్టిగానీ, లేదా విద్యార్థికి కొంత విషయం తెలుసుకోవలసిన అవసరం కలిగినప్పుడు గానీ, ఆ విద్యార్థికి గ్రంథాలయాన్ని ఉపయోగించుకొనే పద్ధతి నేర్పుతారు. ఈ పద్ధతులు తరగతులలో గానీ వ్యక్తిగతంగా గానీ నేర్పవచ్చు. శిశుకేంద్రం లోని రకరకాల బొమ్మలపుస్తకాల మధ్య వ్యత్యాసం గ్రహించటం పిల్లలు నేర్చుకుంటారు. వారు పైకి వచ్చినకొద్దీ వారికి కావలసినదల్లా వారి అభిమాన గ్రంథకర్త వ్రాసిన తక్కిన పుస్తకాల పేర్లూ, విద్యుత్తు, విమానాలు, సంగీతం మొదలైన వారి అభిమానాంశాలపై నున్న పుస్త కాల పేర్లూ మాత్రమే. ఆ తర్వాత బడిలో అధ్యయనం కోసం, ఇంటి వద్ద వినోదంగా చదువుకోటం కోసం, సమాలోచక గ్రంథాలను పత్రికా సూచికలను ఉపయోగించటం అవసర మవుతుంది.

పిల్లలకు ఎక్కువగా చదివే అభిరుచులు కల్పించటం గ్రంథా లయాల ప్రధాన కర్తవ్యాలలో ఒకటి. చదువునేర్చిన అన్ని వయస్సుల, అన్ని తరగతుల పిల్లల బడి అవసరాలకు, బయటి అవసరాలకు, తగిన గ్రంథాలు గ్రంథాలయంలో లభిస్తాయి.

ఈ విధంగా విద్యార్థుల స్వీయవిద్యకు పుస్తకాలు తోడ్పడతాయి. ఉపాధ్యాయులయొక్క, గ్రంథాలయోద్యోగులయొక్క పర్యవేక్షణక్రింద విస్తృతపఠనం వల్ల పిల్లలు ఆ యా విషయాలకు విలువ కట్టటం తమ పఠనశక్తిని పెంపొందించుకోవటం గుణగ్రహణశక్తిని సంపాదించటం నేర్చుకొంటారు.

పాఠశాలా గ్రంథాలయ కార్యక్రమానికి సుశిక్షితుడైన గ్రంథా లయోద్యోగిని వుండటం ముఖ్యం. ఆమెకు బోధనాపరికరాలను గురించీ, బోధనా సాహిత్యాన్ని గురించీ శిక్షణ ఇస్తారు. కనుక ఆమె ఉపాధ్యా యులకూ, విద్యార్థులకూ ఆ విజ్ఞానాన్ని అందజేస్తుంది. ఆమె గ్రంథా

లయ పరిమితులబట్టి విద్యార్థులయొక్క, ఉపాధ్యాయులయొక్క చదువు సంధ్యల విషయంలో జాగ్రత వహించి క్రొత్త పాఠ్య ప్రణాళికలు తీసుకొనే వారికి తరగతులకు నిరంతరం సహాయకారిగా పనిచేస్తుంది. పాఠశాలకు అవసరమైన వివిధ విజ్ఞాన పరికరాల విషయంలో ఆమె శ్రద్ధ వహించి ఆ యా వ్యక్తులకుగానీ, తరగతులకుగానీ అరువుకో అమ్మకానికో వాటిని సమకూర్చిపెడుతుంది. గ్రంథాలయంలో ఉత్సాహకర వాతావరణాన్ని సృష్టించే విధంగా గ్రంథాలయోద్యోగినియొక్క ఆకారరేఖలు ఉండటం అవసరం.

## బోధనా పరికరాలు :

అమెరికా పాఠశాలలలో పెక్కు రకాల బోధనాపరికరాలు ఉపయోగింపబడుతున్నాయి. చాలా పాఠశాలల్లో ఉపాధ్యాయులు తమ పాఠ్య గ్రంథాలకు తోడుగా అనేకరకాల విజ్ఞాన సాధనాలు వినియోగిస్తున్నారు. పిల్లల అధ్యయన విషయాలను గూర్చిన సమాచారం పలుమూలలనుండి అనేకాధారాల ద్వారా వారికి బోధింపబడుతున్నది. వారి అభిరుచులనూ, వయస్సులనూ విజ్ఞాన విషయగ్రహణావసరాలనూ బట్టి ఈ పరికరాలు ఉపయోగించుకొని విలువ గట్టటంలో వారికి సహాయం అందజేయబడుతుంది.

ఈ విధంగా ఉపయోగించే వస్తువులు, కార్యక్రమాలు :

1. పఠనీయ గ్రంథాలు: పాఠ్యపుస్తకాలూ, గౌణవాచకాలూ, విజ్ఞాన సర్వస్వాలు, తక్కిన సమాలోచక గ్రంథాలు, కరపత్రాలు, పత్రికలు, వార్తాపత్రికలు.

2. శ్రవ్య దృశ్య పరికరాలు: మాదిరి వస్తువులు, నమూనాలు, టెలివిజన్, రేడియో, రికార్డులు, ఫిలింలు, స్లైడ్లు, బొమ్మలు, పటాలు, గ్రాఫులు. దేశపటాలు. గ్లోబులూ.

3. పరికరాలు : యంత్రాలు, పనిముట్లు, పరిశోధనాలయ పరికరాలు.

4. సామగ్రి : కాగితం, రంగులు, బంకమన్ను, రంగు బలపాలు, లోహం, దారం, సిరా, జిగురు, సీమసున్నం, చెక్క మొదలైనవి.

5. పిల్లలు చేసిన వస్తువులు, కార్యక్రమాలు : నిర్మాణం, నాటకం, చిత్రకళ, సంగీతం, నృత్యం. సాహిత్యం.

6. సామాజిక సాధనాలు ; పంటపొలాల యాత్రలు, క్షేత్ర పరిశీలన, కొలతలు, సేవా ప్రణాళికలు, అతిధులు.

పైనిచ్చిన పట్టిక విద్యార్థుల విజ్ఞానానికి తోడ్పడే వివిధ వస్తువులనూ విధాలనూ సూచిస్తూంది. ఉపాధ్యాయులకూ విద్యార్థులకూ మనస్సులలో గల విశిష్ట ప్రయోజన సాధనకై బోధనాపద్ధతుల మాదిరిగానే ఈ పరికరాలు గూడా వినియోగింప బడుతున్నాయి.

ఉపాధ్యాయులు బోధనా పరికరాలను ఎన్నుకొని వినియోగించుకొనటంలోనే పిల్లలు సాధ్యమైనంత అనుభవంపొందే అవకాశాలు కల్పిస్తారు. ఉదాహరణకు ఒకతోటను ఎలా నాటి పెంచుతారో విద్యార్థికి తెలియజెప్పటానికి అనేక పద్ధతులు అవలంబింపవచ్చు. అందులో ఈ క్రిందివి కొన్ని :

1. ప్రత్యక్షానుభవం : పిల్లలు బడిలో ఒక తోట నాటి పెంచటం.

2. క్షేత్రయాత్ర ; పిల్లలు ఒక వ్యవసాయ క్షేత్రాన్ని దర్శించి, ఆ కర్షకులతో సంభాషించి, మరింత అనుభవం పొందటం.

3. చలనచిత్రాలు : వ్యవసాయ క్షేత్రంలోని పనిని చూచి, ఆయా వ్యవసాయకులు తమ సమస్యలపై జేసే చర్చలను పిల్లలు వింటారు.

4. చిత్రాలు, పటాలు : పిల్లలు వ్యవసాయ క్షేత్రాలలోని పనిని గూర్చిన బొమ్మలు చూస్తారు. ఉత్పత్తిని గూర్చిన సంఖ్యలు వగైరా పరిశీలిస్తారు.



బాల విద్యార్థుల తరగతిలో

5. మాటలు ; కూరగాయలను ఉత్పత్తి చేయటాన్ని గురించిన వర్ణనను పిల్లలు చదువుతారు.

ఈనాటి పిల్లల పాఠ్యగ్రంథాలు, తక్కిన అచ్చుపుస్తకాలు, ఆయా వయో వర్గాలవారి అభిరుచులకు అనుగుణంగా తయారు చేయబడుతున్నాయి. రంగు రంగులలో ముద్రింపబడే చిత్రాలు, ఛాయాచిత్రాలు గానీ కళాఖండాలు గానీ కావచ్చు. ఎక్కువమంది గ్రంథకర్తలూ సంపాదకులూ తమ గ్రంథాలను ఉపయోగించే విద్యార్థుల చదువు సాములకు తగినట్లుగానే తయారుచేస్తున్నారు.

## పరికరాల సార్థక వినియోగం :

బోధనా పరికరాలు సార్థకంగా వినియోగ పడవలెనంటే రెండు రకాల యోజన అవసరం. (1) ప్రధాన సమస్యలూ, వానికి సంబంధించిన అనుభవాలూ, పరికరాలూ; అంగీకృతమైన ఒక ప్రణాళికను ఉపాధ్యాయుడూ విద్యార్థులూ కలిసి యోజన చేస్తారు. (2) అవసరములైన పరికరాలు అందుబాటులో ఉన్నాయనీ, ప్రక్కదారితీసే అంశాలు నివారింపబడ్డాయనీ, అవసరమైన ఏర్పాట్లు చేయబడ్డాయనీ ధ్రువపరచుకోటానికి తగిన ప్రాతిపదిక విజ్ఞాన సాధనాల వినియోగంకోసం ముందుగా ఉపాధ్యాయుడే యోజన చేస్తాడు.

## పాఠ్య గ్రంథాలు :

బోధనా సాధనాలలో పాఠ్యగ్రంథాలు ఒకానొక భాగంగా మాత్రమే పరిగణింపబడినప్పటికీ, చాలామంది ఉపాధ్యాయులు వాటిమీదనే ఎక్కువగా ఆధారపడుతున్నారనేది సత్యం. దీనికి కారణం కొంతవరకు ఆయా బోధనా సౌకర్యాలు లభించకపోవటం, ఇంకా చాలాభాగం తమ కందుబాటులో నున్న బోధనా సాధనాలను గుర్తించి. ఆ ఉపాధ్యాయులు వాటిని వినియోగించుకోజాలక పోవటం, మామూలుగా చూస్తే ప్రాథమిక తరగతులలో కంటె, ఉన్నత పాఠశాలా విద్యలో (అంటే 7-12 తరగతులకు) పాఠ్యగ్రంథాలు మిక్కిలి ప్రధానపాత్ర నిర్వహిస్తాయి. ఇంకా కొన్నిపాఠశాలలలో ఒకఅంశంలోని పాఠ్యక్రమం ఆ పాఠ్యగ్రంథాలలోని అంశాన్ని బట్టి మాత్రమే నిర్ణయింపబడుతున్నది.

సంయుక్త రాష్ట్రాలలో పాఠశాలల్లో ఉపయోగింపబడే పాఠ్యగ్రంథాలలో అధికభాగం ప్రభుత్వేతర ప్రచురణ కర్తలు ప్రచురించినవే. అన్ని తరగతుల విద్యార్థులూ రకరకాలైన అనేక పుస్తకాలు వాడటం వల్ల పాఠ్యగ్రంథ ప్రచురణ ఒకపెద్ద వ్యాపారంగా పరిణమించింది.

ఒకటి రెండు సందర్భాలలో మినహా పాఠ్యగ్రంథ ప్రచురణలో రాష్ట్ర ప్రభుత్వ విద్యాశాఖలకు ప్రత్యక్ష సంబంధం లేనేలేదు. అయినా పిల్లలకు ఎటువంటి పుస్తకాలు అవసరమో నిర్ధారణ చేసుకోడానికి ప్రచురణ కర్తలు పాఠశాలా కార్యక్రమాలతో సన్నిహిత సంబంధం కలిగించు కొంటారు.

సగానికంటె ఎక్కువ రాష్ట్రాలు ప్రభుత్వ పాఠశాలల్లో ఉపయో గించదగిన పుస్తకాలను నిర్ణయించటం, లేదా - పాఠశాలోపయోగానికి అంగీకృతములైన పాఠ్యగ్రంథాల నిర్ణయం వివిధరాష్ట్రాలలో వివిధ విధాలుగా వుంటుంది. కాని సాధారణంగా ఆ నిర్ణయం రాష్ట్రపాఠశాలా ప్రధానాధికారి చేతగానీ, రాష్ట్ర విద్యాసంస్థచేత గానీ, ఉభయులచేత గానీ నియమించబడిన రాష్ట్రీయ పాఠ్యగ్రంథ నిర్ణాయక సంఘంవారిచే చేయ బడుతుంది. తక్కిన రాష్ట్రాలలో పాఠ్యగ్రంథాలు, తక్కిన బోధనాసాధ నాలు, ఉపాధ్యాయుల పరిశీలకుల సలహాలపైన స్థానిక పాఠశాలాధి కారులచేత నిర్ణయింపబడతాయి. ఇంకా పెక్కు సందర్భాలలో ఆయా పాఠశాలోపాధ్యాయులచేత నిర్ణయింప బడతాయి.

చాలా రాష్ట్రాలలో పిల్లలకు పాఠ్యగ్రంథాలు ఉచితంగా అంద జేయబడతాయి. ఇప్పుడు అన్ని రాష్ట్రాల వైఖరి ఇలాగే వుంది. మూడింట ఒకవంతు రాష్ట్రాలలో రాష్ట్రప్రభుత్వం పాఠ్యగ్రంథాలను పిల్లలందరికీ అందజేస్తుంది. దాదాపు 12 రాష్ట్రాలలో ఈ ఉచిత పాఠ్య గ్రంథాలకయ్యే వ్యయాన్ని రాష్ట్రప్రభుత్వాలు, స్థానిక పాఠశాలా మండ లాలూ పంచుకొంటాయి. దాదాపు 20 రాష్ట్రాలలో మండల, నగర, పట్టణ విద్యాసంస్థలు పాఠ్యగ్రంథాలను ఉచితంగా అందజేస్తాయి.

# 18 - మహోన్నత విద్య

మహోన్నత విద్య అంటే దాదాపు 12 సంవత్సరాలపాటు బడి చదువు పూర్తిఅయిన తర్వాత ప్రవేశించే విద్యాతరగతులు. విద్యాశాఖా కార్యాలయం వారి 'సమాచార దర్శిని' ప్రకారం సంయుక్తరాష్ట్రాలలో 1857 మహోన్నత విద్యాసంస్థ లున్నాయి.

సంయుక్త రాష్ట్రాలలో మహోన్నత విద్య వివిధసంస్థల ఆధ్వర్యాన నిర్వహింప బడుతున్నది. ఈ స్థాయిలోని ఆ యా సంస్థలకు వేరు వేరు పేర్లు పెట్టారు. వీటికి విశ్వవిద్యాలయాలని గానీ, కళాశాలలని గానీ మామూలు అధికారిక నామధేయాలు లేవు. వీటిలో మామూలుగా 4 సంవత్సరాలు కళాశాల విద్యనేర్పి డిగ్రీలిచ్చే కళాశాలలే అధికం. ఇప్పుడు సత్వరాభివృద్ధి చెందుతున్న కళాశాలలు, నాలుగేండ్ల డిగ్రీకి తక్కువ యోగ్యతతో లభించే ఉద్యోగాలకు, అవసరమైన శిక్షణను రెండేండ్లలో సమకూరుస్తున్నాయి. వీటిలో పెక్కింటిని సమాజ కళాశాల లంటారు. ఇవి వయోజన విద్య విషయంలోను ఆ యా స్థానికావసరాలకు అభిరుచులకు మిక్కిలి సన్నిహితంగాను విస్తృత విద్యా కార్యక్రమాలు అమలు జరుపుతున్నాయి. ప్రతి విశ్వవిద్యాలయానికీ ఒక కళాశాల అనుబంధంగా వుంటుంది; అనేక వృత్తి విద్యాలయాలు కూడా అనుబంధాలుగా వుంటాయి. ఉన్నత విద్యకోసం ఒక పట్టభద్ర పాఠశాల కూడా వుంటుంది. ఇవి సాంకేతిక విద్యాసంస్కరణ, ఇంజనీరింగ్ మొదలైన సాంకేతికాంశాలమీద శ్రద్ధ వహిస్తాయి. కాని కొన్ని సాంకేతిక కళాశాలలు విశ్వవిద్యాలయంతో విభిన్నం కాని విద్యనే బోధిస్తాయి. పట్టణస్థాయికి తక్కువలో సాంకేతిక విద్యాబోధక పాఠశాలలను సాంకేతిక పాఠశాలలంటారు. ప్రాథమిక - ఉన్నత పాఠశాలోపాధ్యాయులకు వృత్తిశిక్షణ నిచ్చే సంస్థలను సాధారణంగా ఉపాధ్యాయ కళాశాల

లంటారు. కాని ఒక సంస్థపేరు దాని అర్థానికి తగినట్లుగా ఉండక పోవటం కద్దు.

ప్రతిరాష్ట్రంలోనూ కనీసం ఒక విశ్వవిద్యాలయమైనా వుంటుంది. కేంద్రప్రభుత్వ మిచ్చిన పెద్ద పెద్ద ఈ నమూనాలు ఆధారంగా రాష్ట్ర ప్రభుత్వాలు కళాశాలలను నిర్మించటంవల్ల వీటిని ఈనాం కళాశాలలని కూడా అంటారు. ఈ కళాశాలలు లేక విశ్వవిద్యాలయాలు రాష్ట్ర ప్రభుత్వ నిధులతో ప్రోత్సహింపబడుతున్నప్పటికీ కేంద్రంకూడా తగు ధనసహాయం చేస్తూవుంటుంది. కేంద్రప్రభుత్వం చేసిన మూలచట్టం ప్రకారం ఈ సంస్థలు వ్యవసాయంలోను, పరిశ్రమలలోను, సైనికవ్యవహారాలలోను శిక్షణ ఈయవలసి వుంటుంది. వీటిలోపాటు శాస్త్రీయ సాంప్రదాయక విద్యలుకూడా వుంటాయి. తమ బోధనా కార్యక్రమాలలో వ్యవసాయానికీ, ఇంజనీరింగుకూ, గృహార్థిక శాస్త్రానికీ ఇచ్చే ప్రాముఖ్యాన్ని బట్టి తప్పితే, ఈనాం సంస్థను ప్రభుత్వ విశ్వవిద్యాలయాలకంటె భిన్నంగా గుర్తించటం కష్టం. దాదాపు సగం రాష్ట్రాలలో ప్రభుత్వ విశ్వవిద్యాలయమే ఈనాం కళాశాలగా వుంటుంది. తక్కిన రాష్ట్రాలలో రెండుమూడు వేర్వేరు విద్యాలయాలు కళాశాలలు నడుపబడుతూ వుంటాయి. వాటిలో ఒక ఈనాం కళాశాలకూడా వుంటుంది.

ఈ 1857 మహోన్నత విద్యాసంస్థలలో ఎక్కువ భాగం స్త్రీ పురుషులకు సమానంగా ప్రవేశం కల్పిస్తాయి. వీటిలో 227 సంస్థలకు పురుషులకు మాత్రమే ప్రవేశం వుంటుంది. 226 సంస్థలలో స్త్రీలకు మాత్రమే ప్రవేశం వుంటుంది. చాలా దాక్షిణాత్య రాష్ట్రాలలో తెల్లవారి పిల్లలకు నీగ్రోపిల్లలకు వేరువేరు పాఠశాల లుంటాయి. ముఖ్యంగా నీగ్రోలు హాజరయ్యే పాఠశాలలు 103 వున్నాయి. మహోన్నత విద్యాసంస్థలు తమ తమ ప్రమాణాలలో ఎంతో వైవిధ్యం కలిగివున్నాయి. కొన్నింటిలో .00 మంది విద్యార్థులే వుంటారు. మరికొన్నింటిలో 25,000 నుండి

5ఌ,000 దాకా వుంటారు. ప్రతి సంవత్సరం విద్యాశాఖా కార్యాలయం ప్రచురించే విద్యాదర్శిని మూడవభాగంలోని ఉన్నతవిద్యా విభాగంనుంచి ఒక్కొక్క పాఠశాలలోని విద్యార్థులసంఖ్య, అక్కడి సాధారణ విద్యా విధానంయొక్క స్వభావం తెలుసుకోవచ్చు.

## అధికారం - సహకారం :

అమెరికాలోని మహోన్నత విద్యా సంస్థలు వాటి ఆధిపత్యాన్ని బట్టి రెండు వర్గాలుగా వుంటాయి. మూడింట ఒకపాలు రాష్ట్రప్రభుత్వాలు, పురపాలక సంఘాలు మొదలైన ప్రభుత్వ సంస్థల యాజమాన్యంలో వుంటాయి. కేంద్రం 7 సంస్థలను మాత్రమే తన పెత్తనంక్రింద నడుపుతున్నది. అవి ప్రభుత్వోద్యోగుల శిక్షణకోసం ఉద్దేశింపబడినవి. తక్కిన మూడింట రెండువంతుల విద్యాలయాలు ప్రభుత్వేతర వర్గాల ఆధిపత్యంలో ఉన్నాయి. వాటిలో చాలా భాగం ఏదోఒక మతవర్గానికి చెందినవే. తక్కినవి ఏ బయటి సంస్థతోనూ సంబంధంలేనివి. ప్రభుత్వాధీనంలో గానీ, వ్యక్తుల ఆధీనంలో గానీ నడుపబడే ప్రతిసంస్థా, అది ఏ రాష్ట్రంలో వున్నదో, ఆ రాష్ట్రప్రభుత్వంయొక్క చట్టపూర్వకమైన అధికారం క్రిందగానీ, కొన్ని సందర్భాలలో కేంద్రాధికారం క్రిందగానీ, పనిచేస్తుంది.

ప్రభుత్వాధీనంలోని సంస్థలు, ఆయా ప్రాంతీయ శాసనసభలు ప్రత్యేకించిన ప్రభుత్వ నిధులవల్ల ఎక్కువభాగం నిర్వహింపబడుతుంటాయి. కొద్దిరాష్ట్రాలలో వ్యక్తుల అధీనంలోని సంస్థలకు కూడా ప్రభుత్వనిధులు కేటాయింపబడుతున్నాయి. లాభదృష్టి లేకుండా నడుపబడే ప్రభుత్వ విద్యాలయాలు గానీ, ప్రభుత్వేతర విద్యాలయాలుగానీ, పన్ను మినహాయింపు పేరిట ప్రభుత్వ సహాయం పొందుతాయి. వ్యక్తుల అధీనంలోని విద్యాలయాలు చాలావరకు విద్యార్థుల జీతాలమీద ఆధారపడివుంటాయి. ప్రభుత్వపాఠశాలల్లోగూడా జీతాలు వసూలుచేస్తారు. అవి

ఆ రాష్ట్రనివాసులకు వైయక్తిక విద్యాలయాల్లో కంటె తక్కువ. ప్రభు త్వేతర సంస్థలకు ధర్మనిధులనుండి కొంత ఆదాయం వుంటుంది. ఆయా సంస్థలకుగల ధర్మాదాయం పలువిధాలుగా వుంటుంది. కొన్ని ప్రభుత్వ విద్యాలయాలకు గూడా గట్టిధర్మ నిధులున్నాయి. వైయక్తిక విద్యాసంస్థ లకు, ఈ ధర్మాదాయాలకు తోడు, దానాలవల్ల బహుమానాలవల్ల వచ్చే ఆదాయం తాత్కాలిక శాశ్వతావసరాలకు తగినంత సహాయకంగా వుంటుంది. చాలా కళాశాలలు విశ్వ విద్యాలయాలు తాముచెందిన మత సంస్థలనుండి గట్టి సహాయాన్ని పొందుతాయి.

సంయుక్త రాష్ట్రాలలోని మహోన్నత విద్యా సంస్థలు చాలావరకు సంపూర్ణ స్వయం నిర్ణయాధికారం కలిగివుంటాయి. ప్రతి సంస్థా తన విధానాలను పద్ధతులనూ స్వయంగా నిర్ణయించుకొంటుంది, మరేసంస్థతో గానీ ఎటువంటి ఆధికారిక నిర్మాణ సంబంధాలనూ కలిగివుండదు. కొద్ది రాష్ట్రాలలో ప్రభుత్వ సహాయంపొందే ప్రభుత్వ మహోన్నత పాఠశాలలు ఒకటిగా సమీకృతములైనాయి. కాని అటువంటి సందర్భాలలో కూడా చాలా సంస్థలు తమ కార్యక్రమాలకు పద్ధతులను నిర్ణయించుకొనటంలో చాలావరకు స్వయం నిర్ణయాధికారం కలిగివున్నాయి. వ్యక్తుల అధీనం లోని సంస్థలు తమ కార్యక్రమాల విషయంలోనూ, సేవాధర్మంలోను రాష్ట్రప్రభుత్వానికి లోబడివుండవు.

ఈ సంస్థలకు ఇంత స్వయం నిర్ణయాధికారం ఉండటంవలన ఆయా విద్యాప్రమాణాలను నిలబెట్టటంకొరకు కొన్ని ఏర్పాట్లుచేయటం అవసరమైంది. ప్రభుత్వ విద్యాప్రమాణాలను పాటించే సంస్థలను, కొన్ని ప్రత్యేకసంఘాలద్వారా, ప్రభుత్వం గుర్తిస్తుంది. ఇలా గుర్తించటంకోసం ఏర్పరుపబడిన సంస్థలు ప్రభుత్వేతర స్వయంసేవక సంస్థలు. కొన్ని ప్రత్యేకించి కళాశాలరంగంలో సాధారణ విద్యా కార్యక్రమాలను విలువ కట్టటానికి నిర్మింపబడ్డాయి. తక్కినవి వైద్యం, దంతవైద్యం, న్యాయ

శాస్త్రం మొదలైన ఆయా వృత్తిరంగాలకు ప్రత్యేకింపబడ్డాయి. విద్యార్థులు ఒక సంస్థనుండి మరొక సంస్థలోకి కాలహరణం లేకుండా మారవచ్చును. పై విధంగా గుర్తింపబడిన సంస్థలలో శిక్షణపొందిన వారికి డిగ్రీ లివ్వబడతాయి. కనుక ఒకవిద్యార్థి తాను చేరబోయే సంస్థ గుర్తింపబడినదో కాదో తెలిసికొని మరీ ప్రవేశింపవలసి వుంటుంది.

ఈ స్వయంసేవక సంఘాలకు తోడుగా రాష్ట్రాలుకూడ తమ ప్రాంతంలోని గుర్తింపబడిన బడుల పట్టికను పాటిస్తాయి. కొన్ని సందర్భాలలో ఈ గుర్తింపు సాధారణవిద్యకు సైతం వుంటుంది. కాని చాల భాగం ఉపాధ్యాయ శిక్షణ మొదలైన విశిష్టవిద్యకు పరిమితమై వుంటుంది కనుక ఒకడు ప్రభుత్వ పాఠశాలలో ఉపాధ్యాయ వృత్తి చేయవలెనంటె, అతడు ప్రభుత్వంచేత అధికారికంగా గుర్తింపబడిన ఒక విద్యాలయంలో శిక్షణ పొందవలసి వుంటుంది.

ఆ యా సంస్థల గుర్తింపు వివరాలన్నీ విద్యాదర్శినిలో వుంటాయి.

## నిర్వాహక సంస్థ :

ఒక మహోన్నత విద్యాలయంమీద చట్టబద్ధంగా ఒక ధర్మకర్తల సంఘం ఆధిపత్యం వహిస్తుంది. ఇలాంటి సంఘాల్లో సాధారణంగా పాఠశాలోద్యోగు లెవ్వరూ సభ్యులుకారు. కాని ఈ సంఘసభ్యుడే పాఠశాలా ప్రధాన నిర్వాహణాధికారిగా వుంటాడు. ఈ సంఘ సభ్యులు జీతం లేకుండా పనిచేస్తారు. వారుచేసే పాఠశాలా పర్యవేక్షణ కార్యక్రమం ఒక విధమైన ప్రజాసేవగా భావింపబడుతుంది. ఒక మహోన్నత పాఠశాలా ధర్మకర్త సంఘంలో సభ్యుడుకావటం అంటే అదిఒక విశేషం. అది అతని గుణగణాలకు ఒక గీటురాయి. ప్రభుత్వసంస్థల తాలూకు ధర్మకర్తలు రాష్ట్రి గవర్నరువంటి ఒక ప్రభుత్వాధికారిచేత నియమింప బడతారు. ప్రభుత్వేతర సంస్థల సభ్యులు ఆ యా సంస్థలతాలూకు మత



విద్యార్థుల వ్యాయామం

వర్గాలచేత నియమింపబడతారు. చాలా సందర్భాలలో వ్యక్తుల ఆధీనం లోని పాఠశాలల ధర్మకర్తృ సంఘాల సభ్యులు తమ వారసులను తామే ఎన్నుకొంటారు. వైయక్తిక సంస్థలలో చాలావరకు ప్రభుత్వాధీనంలోని వానిలో కొంతవరకు ధర్మకర్తృ సంఘసభ్యుల ఎన్నిక విషయంలో పట్టభద్రులను పాల్గొననిస్తారు.

ధర్మకర్తృ సంఘం విద్యావిషయాలలో తనకుగల అధికారంలో ఎక్కువ భాగం పాఠశాలాధికారుల, ఉపాధ్యాయులపరం చేస్తుంది. ధర్మ

కర్తృ సంఘం ఏడాదికి కొద్దిసార్లు మాత్రమే సమావేశమౌతుంది. ఉపాధ్యాయులే ఒక శాసనమండలిగా ఏర్పడుతారు. పాఠ్య ప్రణాళికకు బోధనా క్రమానికి సంబంధించిన అన్ని అంశాలపై సిఫార్సుచేసే అధికారం వారిదే. డిగ్రీలు పుచ్చుకోవలసిన విద్యార్థులకు వారిసిఫార్సు తప్పనిసరి. అయితే డిగ్రీలిచ్చే పనిమాత్రం ధర్మకర్తృ సంఘం చేస్తుంది.

ధర్మకర్తృ సంఘంవారు పాఠశాలా ప్రధానాధికారిని ఎన్నుకొంటారు. అతనినే మామూలుగా అధ్యక్షుడని వ్యవహరిస్తారు. ఈ పదవికి అసాధారణ గౌరవంవుంది. ధర్మకర్తలకూ ఉపాధ్యాయ వర్గానికీ సంబంధ బాంధవ్యాలను నెలకొల్పే అధికారి అధ్యక్షుడు. పాఠశాలాసాధారణ లక్ష్యాలను సక్రమమార్గంలో ఉండేటట్లు చూడటం, పాఠశాలకవసరమైన నిధులను సమకూర్చి, వాటిని సక్రమంగా వినియోగించటం, విద్యాకార్య క్రమాభ్యుదయాన్ని కనిపెట్టి వుండటం - ఇవి అధ్యక్షుని విధులు. ఈవిధి నిర్వహణలో అధ్యక్షునికి తోడ్పడేటకుందు ప్రతిమూడు నాలుగు పెద్ద ప్రాంతాలలోను చిన్న ఉద్యోగులు కొందరుంటారు.

1. పాఠశాలకు సంబంధించిన వ్యాపార విషయాలను చూసే ఉద్యోగి ఒకరు. సామాన్యంగా ఇతన్ని ఉపాధ్యక్షుడంటారు. కొన్ని సంస్థలలో ఈ ఉద్యోగిని సంయుక్తాధ్యక్షుడని కూడా వ్యవహరిస్తారు.

2. బోధనేతర విషయాలను పర్యవేక్షించే ఉద్యోగి ఒకరు. ఇతన్ని వ్యక్తి శిక్షణాధికారి అంటారు. ఇలాంటి అధికారులు స్త్రీ పురుషులకు వేరు వేరుగా నియమింప బడవచ్చు.

3. కళాశాలలోని బోధనా కార్యక్రమాన్ని ఒక అధికారి పరిశీలిస్తాడు, బహుళార్థ సాధక సంస్థలలో బహుకళాశాలా విద్యాధికారులు ఈ పని చేస్తారు. ఇలాంటి సందర్భాలలో విద్యా విషయాలకు ఒక ఉపాధ్యక్షుడుంటాడు.

4. ప్రజా సంబంధాల శాఖకు ఉపాధ్యక్షుని హోదాగల ఒక దర్శ కోద్యోగి వుంటాడు.

విద్యకు సంబంధించినంతవరకూ ఆ యా పాఠశాలలకు కళాశాల లకు వేర్వేరు నిర్వాహక సంస్థలుంటాయి. బహువిధములైన వృత్తి విద్యలను బోధించే విశ్వవిద్యాలయ ఇంజనీరింగ్ కళాశాల న్యాయకళా శాలలు పాఠశాలలు ఒక్కొక్క వృత్తి కొక్కటిగా వుంటాయి. పాఠ శాల, కళాశాల అనేపదాలు పర్యాయపదాలు మాత్రమే. వీటిమధ్య స్పష్ట మైన తేడా ఏమీలేదు. ఉదాత్త కళలను బోధించే సంస్థలను కళాశాల లంటారు. కొన్ని సంస్థలలో మొదటిరెండేండ్ల ఉదాత్త కళాబోధన విద్యా ర్థుల సాధారణ విద్యకూడా ఆవశ్యంగా కలిగివుంటుంది. అట్టి కళాశాల సాధారణ విద్యా కళాశాలవలె ప్రత్యేక యాజమాన్యంక్రింద వుంటుంది. విశ్వ విద్యాలయంలో పట్టభద్రులైనవారికి ఉత్తమవిద్య నేర్పే పాఠశాల లను పట్టభద్ర పాఠశాల లంటారు.

ప్రతి పాఠశాలకూ కళాశాలకూ ఒకగురువు ప్రధాన కార్యకర్తగా వుంటాడు. ప్రతి పాఠశాలలోను, కళాశాలలోను ఆ యా పాఠ్యాంశాలను బట్టి పరిపాలనా విభాగాలుంటాయి. కనుక ఇంజనీరింగ్ కళాశాలలో మెకానికల్, సివిల్, ఎలెక్ట్రికల్, కెమికల్ శాఖలు ప్రత్యేకంగా వుండ వచ్చు. ఉదాత్త కళలను బోధించే కళాశాలలో చరిత్ర, గణితం, వేదాంతం, ఇంగ్లీషు మొదలైన శాఖలుండవచ్చు. ఆ యా శాఖల ప్రధా నోద్యోగులను శాఖాధికారు లంటారు.

## పాఠ్యప్రణాళిక - పట్టాలు :

ఉన్నత పాఠశాల విద్య పూర్తిఅయిన పిమ్మట, అంటే మామూ లుగా 12 సంవత్సరాలు చదివిన పిదప, మహోన్నత పాఠశాలా ప్రవేశం లభిస్తుంది. ఒకవిద్యార్థి ప్రవేశయోగ్యత రెండువిధాలుగా నిర్ణయింపబడు

తుంది. చాలా పాఠశాలలలో ఉన్నత పాఠశాలా చరిత్ర ఆధారంగా విద్యా ర్థులను చేర్చుకొంటారు. ఉన్నత పాఠశాలలో తప్పక నేర్వవలసిన పాఠ్యాంశాలు కొన్నివున్నాయి. కాని వాటిని ఎన్నుకోవటంలో కొంత స్వేచ్ఛవుంది. ఇప్పుడు నేర్వవలసిన అంశాలలో ఇంగ్లీషు లెక్కలు విజ్ఞానశాస్త్రం విదేశభాష, చరిత్ర, సాంఘిక శాస్త్రం, ఇంకా ఐచ్ఛికంగా నేర్వదగిన పాఠ్యాంశాలు వున్నాయి, ప్రభుత్వేతర మహోన్నత పాఠ శాలా ప్రవేశానికి ఉన్నత పాఠశాలా పట్టభద్రతను మించిన విద్యాస్థాయి వుండాలి. ఉన్నత పాఠశాలా తరగతిలో విద్యార్థి మొదటి 50 మందిలో గానీ కనీసం మొదటి రెండువంతులమందిలో గానీ లేకపోతే అతనికి మహోన్నత పాఠశాలలో ప్రవేశం లభించక పోవచ్చు

విద్యార్థులను పరీక్షించి చేర్చుకొనే పద్ధతులలోని విద్యాపరీక్షక సంస్థలో ఒకభాగంగా కళాశాలాప్రవేశా పరీక్షాసంఘం స్థాపింపబడింది. ఆ సంఘంద్వారా పాఠశాలలు పరీక్షలు జరుపుతాయి. కొన్ని సంస్థలు ప్రవేశ పరీక్షలు తామే నిర్వహిస్తాయి. కొన్ని సంస్థలు మామూలుగా ఏ కారణం చేతగానీ ఉన్నత పాఠశాలా పట్టభద్ర యోగ్యతా పత్రముల నీయజాల నప్పుడు, ప్రవేశపరీక్షలను నిర్వహిస్తాయి. ఒక నిపుణుడైన విద్యార్థి ఆ యా పాఠ్యాంశాలలో తగువిజ్ఞానం ప్రదర్శించినచో, మామూలు పరీ క్షల తతంగం లేకుండానే చాలా సంస్థలు అట్టివానికీ ప్రవేశం కల్పి స్తాయి. అలాంటి విద్యార్థిని డిగ్రీ (పట్ట) పరీక్షకు అనుమతించేముందు, అతడు మామూలు ప్రవేశయోగ్యత సంపాదించుకోవలసి వుంటుంది.

ఉదాత్త కళారంగంలో పాఠ్యప్రణాళిక నాలుగంశాలతో కూడి వుంటుంది. (1) ప్రతి విద్యార్థీ చదివితీరవలసిన పాఠ్యక్రమం. ఇది నూటికి 20, 25 పాళ్ళు ఉంటుంది- (2) ఆర్థికశాస్త్రం - లేక - రసా యనిక శాస్త్రం ఈరెంటిలో ఒకదానిలో కేంద్రీకృతమైనవిద్య ఈఅంశంలో ఎంత పరిజ్ఞానం కావాలనేది ఆ శాస్త్రీయ విభాగంవారు నిర్ణయిస్తారు.

దీనిలో నూటికి 20, 30 పాళ్ళు కాలం పరిశ్రమించవలసి వుంటుంది (3) ప్రధాన పాఠ్యాంశానికి అనుబంధించిన మరొకశాఖలో దాదాపు మొత్తం కాలంలో 15% కేంద్రీకరింపబడాలి. (4) ఆ పాఠశాలలో ఉన్న ప్రత్యేకాంశాలలో విద్యార్థి ఎన్నుకొన్నవి.

వృత్తివిద్యా పాఠశాలలో పాఠ్యప్రణాళిక కఠినంగా వుంటుంది. విద్యార్థి తనకాలంలో అధికభాగం అతడు కోరుకొన్న ప్రత్యేకాంశాలకే వినియోగింపబడుతుంది. అనుబంధ పాఠ్యాంశాన్ని ఎన్నుకోవటం సాధ్యమే అయినా పట్టభద్రవిద్యార్థి మామూలుగా తన ప్రధాన పాఠ్యాంశం మీదనే కేంద్రీకరిస్తాడు.

ఏ పాఠశాలగానీ తన నిర్మాణ నిబంధనల పరిమితికి లోబడి, తన కిష్టమైన డిగ్రీని ఈయవచ్చు. ఒకటి రెండు రాష్ట్రాలలో ఏ విద్యా సంస్థ గానీ ఒకడిగ్రీ నిచ్చేముందు ప్రభుత్వామోదం పొందవలసి వుంటుంది. కాని ఇది సర్వసాధారణం కాదు.

## డిగ్రీలు :

మామూలుగా మహోన్నత పాఠశాలల్లో నాలుగేండ్ల విద్యా పూర్తై నప్పుడు బి. ఏ., బి. ఎస్. సి. డిగ్రీలిస్తారు; ఈ రెండు డిగ్రీల మధ్య భేదం అంత స్పష్టమైనది కాదు. కాని బి. ఎస్ సి. విద్యార్థి ప్రధాన పాఠ్యాంశం శాస్త్రవిషయకమైనదై వుంటుంది. కొన్ని సంస్థలతో ప్రధాన పాఠ్యాంశం ఏదైనా, బి. ఏ. డిగ్రీయే ఇస్తారు. ఈ పట్టములు ఆ యా విద్యార్థులు నేర్చిన వివిధ పాఠ్యాంశాలలో ఈయవచ్చును. కనుక ఒక సంస్థ బాచెలర్ ఆఫ్ మ్యూజిక్ అని గానీ బి. ఏ. ఇన్ మ్యూజిక్ అని గానీ, బి. ఎస్ సి. ఇన్ మ్యూజిక్ అనిగానీ డిగ్రీ ఇవ్వవచ్చు. ఇలాంటి డిగ్రీలు అనేకరకాలు ఉన్నాయి.

వృత్తి విద్యలలో డిగ్రీలు ఒక్కొక్క రంగానికి ఒక్కొక్క తీరుగా వుంటాయి. వైద్యంలో, మూడేండ్ల వైద్య విద్యానం

తరం 'డాక్టర్ ఆఫ్ మెడిసన్' అనే డిగ్రీ ఇస్తారు. మూడేండ్లు కళాశాలలో చదివిన తర్వాత ఈ వైద్యవిద్యార్థులు మూడేండ్లు వైద్య కళాశాలలో చదవాలి. న్యాయశాస్త్రంలో బి. ఎల్. అనేది తొలిడిగ్రీ, రెండు మూడేండ్లు కళాశాలలో చదివిన తర్వాత, మూడేండ్లు న్యాయ శాస్త్రం అభ్యసించినవారికి ఈ డిగ్రీ ఇస్తారు. ఇంజనీరింగ్ కళాశాలలో ఉన్నతవిద్య పూర్తి అయితే చాలు. నాలుగైదేండ్లు ఇంజనీరింగ్‌లో శిక్షణ పొందిన తర్వాత తొలివృత్తి పట్టం లభిస్తుంది. ఆ యా వృత్తిరంగాల డిగ్రీల వివరం స్థలాభావం వలన ఇక్కడ సంక్షేపించబడింది.

కొన్ని వృత్తి పాఠశాలలు ఉత్తమ పట్టాలనిస్తున్నా, మామూలుగా విశ్వ విద్యాలయాల్లోని పట్టభద్రుల పాఠశాలలో మాత్రమే ఉత్తమ డిగ్రీలు లభిస్తాయి, బి. ఏ. డిగ్రీపైని మొదటి ఉత్తమ డిగ్రీ ఎం. ఏ. దానికై బి. ఏ. అయిన తర్వాత 1 సంవత్సరం చదవాలి. అన్నిటికంటె పెద్దడిగ్రీ పి హెచ్, డి. దీనికి బి. ఏ. అయినాక 3 ఏండ్లు చదివి, ఏదో ఒక పరిశోధనను విజయవంతంగా చేయవలసి వుంటుంది.

డిగ్రీలలోను, పాఠ్యప్రణాళికలలోను ఉన్నరకాలు మహోన్నత పాఠశాలా దశలో విద్యార్థులు, ఎన్నుకోదగిన పాఠ్యాంశాల పరిధి, అమెరికాలోని విశ్వవిద్యాలయాలు కళాశాలలు నేర్పే పాఠ్యాంశాల విపరీత విస్తృతికి దారితీశాయి. కళాశాలా స్థాయికి తగినట్లు నిర్ణయింపబడిన పాఠ్యాంశాల సంఖ్య అసంఖ్యాకం. బి. ఏ. డిగ్రీ ఇచ్చే కళాశాలల్లో ఉన్న పాఠ్యాంశాలన్నీ చదవాలంటే ఒక విద్యార్థికి నిండా 30 ఏళ్ళు పడుతుంది. పట్టభద్రస్థాయిలో ప్రత్యేకాధ్యయనం చేయవలసిన పాఠ్యవస్తువు అంత విస్తృతంగా పెంపొందింది. ఊహించటానికి వీలైన ఏ చిన్న పాఠ్యాంశమైనా ఎక్కడో ఒక కళాశాలలో బోధనాంశంగానే వుంటుంది.

కళాశాల విశ్వవిద్యాలయ విద్యార్థులు ఆ యా తరగతులు పూర్తి అయిన పైడిగ్రీలు పొందుతారు. ఒకవిద్యార్థి ప్రతితరములోను 5 నుండి

లేక 6 వివిధ తరగతులలో విద్య నభ్యసించవచ్చు. పెరములో ఆ తర గతిలో పిల్లవాడు పొందుతున్న అభివృద్ధిని ఉపాధ్యాయుడు గమనిస్తాడు. పెరము పూర్తిఅయిన తదుపరి అంతిమపరీక్ష వుంటుంది. ప్రతి పెరము చివర ఉపాధ్యాయుడు ప్రతి విద్యార్థిని గూర్చిన అభివృద్ధి పట్టిక అంప జేస్తాడు. విద్యార్థి ఆ యా విద్యల్లో సాధించిన విజయాలను రిజిస్ట్రారు అధికారిక పాఠశాలరికార్డులతో వ్రాసుకొంటారు. కొన్ని సంస్థలలో బి. ఏ. విద్యార్థులు సమగ్ర పరీక్షలకు హాజరుకావలసి వుంటుంది. ఉత్తమ డిగ్రీ లకు ప్రతి పెరము చివరా పరీక్షఉన్నప్పటికీ, చిట్టచివరకు పెద్దపరీక్ష ఒకటి వుంటుంది.

## విద్యార్థి జీవితం:

సంయుక్త రాష్ట్రాలలోని మహోన్నత విద్యా సంస్థలలో పెక్కింట విద్యార్థులకు గృహవసతి వుంది. పాఠశాలా భవనాలలో గాక, బయటవిద్యార్థులు నివసించే గృహాలమీద, ముఖ్యంగా విద్యార్థినులు నివ సించే ఇండ్లమీద, గట్టి అజమాయిషీ వుంటుంది. పాఠశాలల్లో వసతి సౌకర్యం కావలెనంటే కొంతమూల్యం చెల్లించాలి. కాని సాధారణంగా ఏ పాఠశాలగానీ వసతిభోజన సౌకర్యాలకోసం తన నిధులను వినియో గించదు. దాదాపు అన్ని సంస్థలూ పాఠశాలా భవనాల్లో నివసించే విద్యార్థు లందరికీ భోజన సదుపాయం కల్పిస్తాయి.

ప్రతి పాఠశాలలోనూ విద్యార్థుల ఆరోగ్యంపట్ల ప్రత్యేకశ్రద్ధ చూపబడుతుంది. మామూలు జబ్బులు నయంచేయటానికి వైద్యులుం టారు. పిల్లల జబ్బులను పరిశీలించి అవసరమైన వారిని ఆసుపత్రులలో చేర్చే సౌకర్యంకూడా వుంటుంది. ఆరోగ్యవ్యవహార నిర్వహణకు గాను పిల్లలందరూ పాఠశాలకు కొంతరుసుము చెల్లించాలి.

కళాశాలలో గానీ, విశ్వవిద్యాలయంలో గాని నిజమైన విద్యలో ఎక్కువభాగం పాఠ్యక్రమేతర కార్యక్రమాలలోనే వుంటుంది. ఈ

కార్యక్రమాలు మామూలు తరగతికి బయట నిర్వహింపబడతాయి. ప్రతి విద్యార్థీ ఏవో కొన్ని కార్యక్రమాలలో పాల్గొనితీరాలి. అందరి అభిరుచులకూ తగినట్లుగా ఈ కార్యక్రమాలు రకరకాలుగా వుంటాయి. నాటకాలు, సంగీతం, ఆటలు - మొదలైన ఈ కార్యక్రమాలు బహుళ వ్యాప్తిలో వున్నాయి. ఆటల పోటీలకు విద్యార్థులనుండీ పౌరులనుండీ గుంపులు గుంపులుగా వస్తారు. సాంఘికవర్గాలు రకరకాలుగా వుంటాయి. ఒక్కొక్క పాఠ్యాంశానికి ఒక్కొక్క క్లబ్బు వుంటుంది. పాఠ్యక్రమేతర కార్యక్రమాలను పెంపొందించటానికి పాఠశాల కృషిచేయటమే కాక, విద్యార్థులు వాటిలో పాల్గొనటానికి పూర్తి అవకాశంకూడా కల్గిస్తుంది.

అమెరికాలో కళాశాలల్లో గానీ, విశ్వ విద్యాలయాలలో గానీ చదవవలెనంటే, అది చాలా వ్యయంతో కూడిన పని. గొప్ప తెలివితేటలుండీ, ఆ ఖర్చు భరించలేని విద్యార్థులు చాలామంది వున్నారు. ఈ పరిస్థితిని చక్కబరచటానికై చాలా పాఠశాలలు విద్యార్థులకు కొన్నివిధాల ధనసహాయం చేస్తాయి. విద్యార్థియొక్క చదువు మొదలైనవాటికి కావలసినంత ధనం విద్యార్థివేతనంగా ఈయబడుతుంది. ఉదారంగా అప్పులు కూడా ఇస్తారు. పట్టభద్ర విద్యార్థులకు వారిచదువు కయ్యే ఖర్చుకు సమానంగా జీతం ఇచ్చి సభ్యత్వం కల్పిస్తారు. వేరే ఉద్యోగాలు చేసి చాలామంది విద్యార్థులు తమ బడిచదువుకయ్యే ధనం సంపాదించుకొంటారు. విద్యార్థి తన బడిఖర్చు సంపాదించే అవకాశం కల్పించటానికి పాఠశాలలు కృషిచేస్తున్నాయి.

ఆచరణలో ప్రతి పాఠశాలలోనూ విద్యార్థి వేతనాలకై లభ్యమయ్యే ధనం విద్యార్థులకు నిజంగా అవసరమయ్యే దానికంటె చాలా తక్కువ. అందువల్ల పోటీ పరీక్షలుపెట్టి మిక్కిలి యోగ్యులుగా నెగ్గిన విద్యార్థులకు మాత్రమే ఉచితవేతనం ఈయబడుతుంది. కొన్ని పాఠశాలలలో విదేశీయ విద్యార్థులకు ప్రత్యేక ధనసహాయం వున్నప్పటికీ, సాధారణంగా అన్ని



వ్యాయామం

పాఠశాలల్లోనూ విద్యార్థి వేతనంకోసంవాసకూడా తక్కినవారితో పోటీ చేయవలసే వుంటుంది. డబ్బులేక, తాము చేరదలచిన పాఠశాలలో విద్యార్థివేతనం లభింపక. అమెరికాలో చాలామంది సమర్థులైన యువకులు కళాశాలకు హాజరుకాలేక పోతున్నారు.

బడిబయట విద్యార్థి జీవితంలోని వివిధ దశలను అదుపులో పెట్టటటం చాలాకళాశాలలలోనూ విశ్వ విద్యాలయాలలోనూ ప్రధాన కర్తవ్యంగా ఉన్నది. ఈ విద్యార్థి వ్యక్తిశిక్షణ గడచిన ముప్పదేండ్లలో అమెరికాలో విశిష్టంగా వృద్ధిచెందింది. ఈ చర్యలు కొనసాగించటానికి పాఠశాలలు సుశిక్షితోద్యోగులను క్రమక్రమంగా ఎక్కువమందిని నియమించుకొంటున్నాయి.

## విద్యావత్సరం :

సంయుక్త రాష్ట్రాలలో విద్యావత్సరం సెప్టెంబరు చివరన గానీ అక్టోబరు మొదట గానీ ప్రారంభమై జూన్‌దాకా 9 నెలలపాటు ఉంటుంది. క్రిస్మస్ ఉగాదులకు ఒకటి రెండు వారాలు, వసంతంలో ఈస్టర్‌కు ఒక వారంలోపు సెలవులుంటాయి.

చాలా పాఠశాలలలో విద్యావత్సరం రెండర్ధాలుగా విభక్త మవుతుంది. ఒక్కొక్క అర్ధం 18. వారాలు మొదలికి జనవరి చివరకో ఫిబ్రవరి మొదటికో అంతమవుతుంది, ద్వితీయార్ధం జూన్‌తో అఖరవుతుంది. తక్కిన పాఠశాలలో సంవత్సరము మూడు పెరములుగా వుంటుంది. వీటినే క్వార్టర్లు అందురు. ఒక్కొక్క క్వార్టరు 12 వారాలు. మొదటిది క్రిస్మస్‌తోను, రెండవది మార్చితోను, మూడవది జూన్‌తోను అంతమవుతాయి. దాదాపు అన్ని తరగతులూ పాఠ్యాంశాలూ ఈ పెరములకు గానీ, అర్ధవత్సరాలకు గానీ అనువుగా ఏర్పాటు చేయబడతాయి.

నానాటికీ ఎక్కువ పాఠశాలలు వేసవిలో కూడా విద్యాబోధన చేస్తున్నాయి. క్వార్టర్ల లెక్కన ఇది నాల్గవ క్వార్టరు. అర్ధవత్సరాల లెక్కన ఇది అర్ధవత్సరం. లేదా అర్ధవత్సరంలో మూడింట రెండు వంతుల కాలం. వేసంగిబడి, మామూలు బడికి హాజరు కాజాలని ఉపాధ్యాయులూ మొదలైన వారికోసం, ఏర్పాటు చేయబడింది. మామూలు

బడికి హాజరయ్యే విద్యార్థులు కూడా ఎండాకాలం బడికి హాజరవుతారు. అందువల్ల వారికి డిగ్రీ పొందటానికి అవసరమైన కాలం కలిసివస్తుంది. ఎండాకాలం హాజరు కావటంవల్ల ఒకవిద్యార్థి నాలుగేండ్ల కళాశాలా విద్యను మూడేండ్లలో పూర్తిచేయవచ్చు.

## ఉపాధ్యాయ విద్య :

ఈ శతాబ్దిలో ఉపాధ్యాయ విద్య కవసరమైన సంవత్సరాల సంఖ్య నానాటికీ పెరుగుతున్నది. 1910 లో మామూలు ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుడు ఉన్నత పాఠశాలా పట్టభద్రుడయివుంటే ఆ యోగ్యత చాలు. ఇప్పుడు ప్రాథమిక పాఠశాలల్లోను, ఉన్నత పాఠశాలల్లోను పనిచేసే ఉపాధ్యాయులు 12 సంవత్సరాల ప్రాథమిక - ఉన్నత పాఠశాలా విద్యను పూర్తిచేసిన పిమ్మట మూడు సంవత్సరాలపాటు కళాశాలా విద్య నభ్యసించి వుండాలి. ఏమైనా ఉపాధ్యాయునికి కావలసిన యోగ్యతల విషయంలో వివిధ రాష్ట్రాలమధ్య, వివిధ విద్యాసంస్థల మధ్య, వివిధ ఉపాధ్యాయ స్థానాలమధ్య, ఎంతో అంతరం వుంది. ప్రాథమిక పాఠశాలల్లో ఉపాధ్యాయులకు ఉన్నత పాఠశాలోపాధ్యాయుల కుండవలసినంత యోగ్యత అవసరంలేదు. పల్లె ప్రాంతాల ఉపాధ్యాయులకు నగరోపాధ్యాయుల కుండవలసినంత శిక్షణ అక్కరలేదు. అంతేగాక వివిధరాష్ట్రాల మధ్య ఉపాధ్యాయుల కుండవలసిన యోగ్యతల విషయంలో వ్యత్యాసం ఒక ఏడాది కళాశాలా విద్యనుండి నాలుగేండ్ల విద్యదాకా వుంది.

కళాశాలా పట్టభద్రులైనవారు రెండేండ్ల శిక్షణానంతరం విశ్వవిద్యాలయ కళాశాలా విజ్ఞానసంఘ సభ్యులవుతారు. అలాంటివారే 3 సంవత్సరాలు గానీ అంతకంటె ఎక్కువకాలం గానీ పరిశోధన చేసి పిహెచ్. డి. డిగ్రీపుచ్చుకుంటారు.

## యోగ్యతా పత్రాలు:

ఒక్క మసాచూసెట్స్ రాష్ట్రంలో తప్ప, తక్కిన ప్రభుత్వ పాఠశాలోపాధ్యాయులకు ఒకటిగాని అంతకంటె ఎక్కువగాని రకాల యోగ్యతాపత్రా లిస్తారు. ఇది రాష్ట్రవిద్యా సంఘం, విద్యాశాఖ, లేక-విద్యా పర్యవేక్షకాధికారి ద్వారా జరుగుతుంది. మూడింట రెండువంతుల రాష్ట్రాల పాఠశాలల్లో పనిచేయటానికి ఉపాధ్యాయ యోగ్యతాపత్రం అవసరం లేదు. ఒకవేళ ఎప్పుడైనా నాల్గేళ్ళ కళాశాలలు గానీ విశ్వ విద్యాలయాలు గానీ ఉపాధ్యాయ యోగ్యతా పత్రాలు కావలెనని కోరితే కోరవచ్చు.

రెండవరకం రాష్ట్రాలలో సరిగా ఒకేరకం యోగ్యతా పత్రాలు కావాలి. ఇవి ఆ యా పాఠ్యాంశాలను బట్టిగానీ, ఉపాధ్యాయులు యోగ్యత సంపాదించిన రంగాలను బట్టిగానీ, ఆ యోగ్యతా పత్రపు ఆయుః పరిమితిని బట్టిగానీ, ఇంకా ఇతరవిషయాలను బట్టిగానీ వేరు వేరుగా వుంటాయి. నాలుగేళ్ళ ఉన్నత విద్యాభ్యాసానంతరం ఒక ఏడాదిలోపు కళాశాలా విద్యవుంటే..రెండు రాష్ట్రాలలో ప్రాథమికోపాధ్యాయునికి ఆ యోగ్యత చాలు; కాని 17 రాష్ట్రాలలో నాలుగేళ్ళ కళాశాలా విద్య కావాలి. చాలా రాష్ట్రాలలో ఉన్నత పాఠశాలా బోధనకు నాల్గేండ్ల కళాశాలా విద్యకావాలి. కొద్దిరాష్ట్రాలు మాత్రం రెండేండ్ల కళాశాలా విద్య కలవారిని ఉన్నత పాఠశాలల్లో బోధించటానికి అనుమతిస్తాయి. ఇప్పుడు 4 రాష్ట్రాలలో ఐదేండ్ల కళాశాలా విద్య కావాలి.

ప్రాథమిక - ఉన్నత పాఠశాలలలోని ఉపాధ్యాయుల యోగ్యతకు కావలసిన విద్యా ప్రమాణాలు నానాటికీ పెంచబడుతున్నాయి. అంతేగాక పాఠశాలా నిర్వాహకులు ప్రభుత్వం నియమించిన విద్యాప్రమాణాలకంటె ఎక్కువ విద్యా ప్రమాణాలు గలవారినే ఉపాధ్యాయులుగా నియమిస్తున్నారు.

ఉపాధ్యాయ యోగ్యతాపత్రాల ఆయుః ప్రమాణం ఒక సంవత్సరం మొదలు ఆ వ్యక్తి జీవితాంతం వరకు ఉండవచ్చు. తాత్కాలిక యోగ్యతా పత్రాల నిచ్చి, ఆ తర్వాత వారు తగిన విద్యా విజ్ఞానాలను సంపాదించిన అనంతరం ఆ యోగ్యతా పత్రాలను పునర్స్వీకరించటం మంచిదనే ధోరణి ఒకటి ప్రబలంగా వుంది. సగటున నలుగురిలో ఒక ఉపాధ్యాయుడు ఏటేటా వెంబాకాలపు బడులకు గానీ, విస్తృత విద్యా తరగతులకు గానీ, హాజరై తన విద్యను అభివృద్ధి చేసుకోవలసి వుంటుంది.

ఉపాధ్యాయులకు కొన్ని కొన్ని ప్రమాణాలలో ఒక పాఠ్యాంశంలో గానీ, పెక్కు పాఠ్యాంశాలలో గానీ, ఒక కార్యరంగంలో గానీ, పెక్కు రంగాలలో గానీ, యోగ్యతా పత్రాలు ఈయవచ్చు. విస్తృతమైన లేక దీర్ఘ కాలికమైన శిక్షణ పొందినవారికి ఆ యా ప్రత్యేక పాఠ్యాంశాలలో, ఆ యా ప్రమాణాలలో, కార్యరంగాలలో యోగ్యతా పత్రాలు ఈయబడుతాయి.

విద్యార్థి బోధన, విద్యా విషయిక మనస్తత్వ శాస్త్రం మొదలైన వృత్తి సంబంధమైన పాఠ్యాంశాలు ఉన్నత తరగతి యోగ్యతా పత్రాల కోసం పఠించవలసి వుంటుంది.

## వేతనాలు :

ఉపాధ్యాయుల యొక్క, పాఠశాలా నిర్వాహకుల యొక్క - జీతాలు రాష్ట్రం రాష్ట్రానికీ, ప్రాంతం ప్రాంతానికీ, వేర్వేరుగావుంటాయి. అయినప్పటికీ ఈ వ్యత్యాసాలు పదేండ్ల క్రితంకంటె ఇప్పుడు తక్కువ. 48 రాష్ట్రాలలో యోగ్యులైన ఉపాధ్యాయుల కనీస వేతనాలను నిర్ణయిస్తూ చట్టాలు చేయబడ్డాయి. ఆ యా విద్యామండలాలు నిర్ణీత వేతనాలు ఈయవలసి వుంటుంది. బి. ఏ. పట్టంగల ప్రాథమికోపాధ్యాయులకు గానీ, ఉన్నత పాఠశాలోపాధ్యాయులకు గానీ, తొలిదశలో వార్షిక

వేతనం 1800 నుండి 2400 డాలర్ల వరకూ వుంటుంది. ఈ రాష్ట్రాలలో పదేండ్లు గానీ, అంతకెక్కువ గానీ అనుభవం గల ఉపాధ్యాయులకు ఏడాదికి 3200 నుండి 4000 దాకా వేతనం లభిస్తుంది. చాలా పెద్ద విద్యాలయ సంస్థలు బి. ఏ. పట్టంగల ఉపాధ్యాయులకు ఈపై జెప్పిన ప్రమాణాలకంటె ఎక్కువ వేతనాలే ఇస్తున్నాయి. ఎం. ఏ. పట్టంగల ఉపాధ్యాయులకు బి. ఏ. పట్టంగల వారికంటె ఏడాదికి 300 నుండి 400దాలర్ల దాకా అధిక వేతనం లభిస్తుంది. 1950 - 51 లో సంయుక్త రాష్ట్రాలలోని ప్రభుత్వ పాఠశాలోపాధ్యాయుల సగటు వార్షికవేతనం 2,980 డాలర్లు. విశాలనగర పాఠశాలా కళాశాలా పర్యవేక్షకులూ, విశ్వ విద్యాలయాధ్యక్షులూ సంవత్సరానికి 10,000 నుండీ 25000 డాలర్ల దాకా వేతనం తీసుకొంటారు. కళాశాలా విజ్ఞాన సమితి సభ్యులు ఉపాధ్యాయుల కంటె ఎక్కువ, పర్యవేక్ష కాధ్యక్షులకంటె తక్కువజీతం పుచ్చుకొంటారు.

## ఉద్యోగ కాలం.

జీతాలు, యోగ్యత, ఉద్యోగపు షరతులు మొదలైనవాటిలాగానే, ఉపాధ్యాయుల వుద్యోగకాల పరిమితికూడా భిన్న భిన్నంగా వుంటుంది. పల్లెటి పాఠశాలల్లో ఈ పరిమితి మిక్కిలి తక్కువ. నగర పాఠశాలలలో మిక్కిలి ఎక్కువ. పల్లెటి పాఠశాలల్లో కంటె మంచిజీతాలు, మంచి పరిస్థితులుగల పట్టణాలకూ నగరాలకూ పోవలెనని గ్రామీణోపాధ్యాయులు చూస్తూ వుంటారు. చాలా ఏండ్లుగా ఉద్యోగకాల పరిమితి క్రమ క్రమంగా పెంచబడుతున్నది. ఇప్పుడు ఈ పరిమితి సగటున 10-15 సంవత్సరాల మధ్యవుంది.

అన్ని రాష్ట్రాలలో ఉపాధ్యాయులను నియమించేది స్థానిక పాఠశాలాధికారులే. ప్రభుత్వశాసనం అన్యథా నిర్దేశించనప్పుడు, వుద్యోగ కాల పరిమతి పూర్తిగా స్థానిక పాఠశాలాధికారుల చేతిలోనే వుంటుంది.

కొన్నిచోట్ల 'ప్రొబేషను' పూర్తిఅయిన తర్వాత శాశ్వతంగాను, కొన్ని చోట్ల ఏడాదికి ఓంచిన ఖరారుల రూపంలోను, ఇంకా కొన్నిచోట్ల ఆ యా రాష్ట్రాలు ఆమోదించిన ఇలాంటి కొన్ని ఏర్పాట్ల రూపంలోను, ఈ కాల పరిమితి నిర్ధారింపబడుతుంది.

ఇప్పుడు అన్ని రాష్ట్రాలలో ఉపాధ్యాయుని యొక్క ఉద్యోగ విరమణ కాలాన్ని నిబంధించే చట్టాలున్నాయి. కొంతకాలం పనిచేసిన తర్వాత ఉద్యోగ విరమణ చేసిన ఉపాధ్యాయుడు ఈ చట్టంక్రింద 'పింఛను' సౌకర్యం పొందుతాడు.

## ఉపాధ్యాయ సంఘాలు :

చాలామంది ఉపాధ్యాయులకు ఆ యా ఉపాధ్యాయ సంఘాలు న్నాయి. అన్నింటిలోనికి పెద్దది జాతీయ విద్యాసంఘం. ఇందులో 4,53,797 మంది ఉపాధ్యాయ సభ్యులున్నారు. ఈ సంఘంయొక్క వివిధ శాఖలలోనూ, అనుబంధ సంస్థలలోనూ, చాలామంది ఉపాధ్యాయులూ పర్యవేక్షకులూ నిర్వాహకులూ ఉన్నారు. వీరిలో చాలామంది ప్రభుత్వ పాఠశాలల్లో పనిచేసేవారే. ఇదేకాక, దేశీయంగా ప్రాంతీయంగా రాష్ట్రీయంగా స్థానికంగా పనిచేస్తున్న ఉపాధ్యాయ సంఘాలు ప్రభుత్వ ప్రభుత్వేతర పాఠశాలోపాధ్యాయులకు వారి వారి విద్యనూ, బోధనానుభవాన్నీ పెంపొందించుకోటానికీ, వృత్తిరంగంలో వృద్ధి పొందటానికీ వారికి అవకాశాలు కల్పించటం ద్వారా సహాయపడుతున్నాయి. అమెరికా ఉపాధ్యాయ సమాఖ్య ఒకటి, కార్మికసంఘంలాగా ఏర్పరచబడి, అమెరికా సమాఖ్యకు అనుబంధంగా నిర్వహింపబడుతున్నది.

# 19 - ప్రభుత్వ - కళాశాలా - ప్రత్యేక - గ్రంథాలయాలు

అమెరికా విద్యా విధానంలో గ్రంథాలయాలు ఒక ప్రధానాంగంగా పనిచేస్తున్నాయి. అవి అన్నివయస్సులవారికీ అందుబాటులో ఉండి, అన్ని రకాల విద్యకూ తోడ్పడుతున్నాయి. సంయుక్త రాష్ట్రాలలోని గ్రంథాలయాలను ప్రధానంగా ఆరువిధాల వర్గీకరింపవచ్చు: 1. ప్రాథమిక-ఉన్నత పాఠశాలా గ్రంథాలయాలు, 2. విశ్వ విద్యాలయ - కళాశాలా గ్రంథాలయాలు, 3. ప్రభుత్వ గ్రంథాలయాలు, 4. రాష్ట్ర గ్రంథాలయాలు, 5. కేంద్ర గ్రంథాలయాలు, 6. ప్రత్యేక గ్రంథాలయాలు.

కళాశాలా గ్రంథాలయాలు విద్యాబోధనలోను, పరిశోధనలోను, ప్రధానపాత్ర నిర్వహిస్తాయి. 'సర్వే' తరగతులు, 'ఆనర్సు' తరగతులు, స్వతంత్ర పఠనం - వీటివలన కళాశాలా గ్రంథాలయావశ్యకత ఎంతగానో పెరిగింది. విస్తృత పట్టభద్ర విద్యకోసం పరిశోధనా సామగ్రి, దానిని వినియోగించుకొనే అవకాశాలు ఆవశ్యకాలైనాయి.

ప్రభుత్వ గ్రంథాలయాలు తొలుదొల్త 19 వ శతాబ్ది మధ్యలో నెలకొల్పబడ్డాయి. ఇప్పుడు దేశంలో వీటికి ప్రధానస్థానం వుంది. వీటిలో 12,50,00,000 పుస్తకాలున్నాయి. 1955 లో ఇవి గృహోపయోగానికి అందజేసిన మొత్తం పుస్తకాల సంఖ్య 32,40,00,000 లు. ఈ గ్రంథాలయాలు సరదాగా చదువదగిన గ్రంథాలందజేయటమే కాక, సాధారణ ప్రజకు ఇంకా ఎక్కువసేవ చేస్తున్నాయి. వీనిలో చాలా గ్రంథాలయాలు సాంకేతిక, వ్యాపార, మానవశాస్త్ర, లలితకళాదిక వివిధాంశాలలో వివిధ శాఖలు కలిగి. ఆ శాఖలలో ఆ యా అంశాలలో ప్రవీణులైన గ్రంథాలయోద్యోగులను నియమించుకొని వున్నాయి. పాఠకులకు తగు సలహాలివ్వటం ద్వారాను, ఇంకా ఇతర విధాల ప్రభుత్వ గ్రంథాలయాలు వయో

జన విద్యాభివృద్ధికి తోడ్పడుతున్నాయి. ఇంకా ప్రభుత్వ గ్రంథాలయాలు బాల బాలికలకు కావలసిన గ్రంథాలు సమకూర్చటం ద్వారాను, పాఠశాలలతో సహకరించటం ద్వారాను, అమూల్యమైన సేవ చేస్తున్నాయి.

కొద్దిపాటి మినహాయింపులతో, ఆ యా రాష్ట్రాలు స్థానిక గ్రంథాలయ కార్యక్రమానికి అనుబంధంగా, గ్రంథాలయ సౌకర్యంలేని మారుమూల పల్లెలకు గ్రంథాలను అందజేసే నిమిత్తం, గ్రంథాలయ విస్తరణ కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయి. 48 రాష్ట్ర గ్రంథాలయాలకు తోడు, 330 కేంద్ర గ్రంథాలయాలున్నాయి. ఈకేంద్ర గ్రంథాలయాలు ముఖ్యంగా ప్రభుత్వోద్యోగుల అవసరాలకోసమే ఉద్దేశింప బడినప్పటికీ ఇవి దేశమంతటా విజ్ఞానవేత్తలకూ, శాస్త్రజ్ఞులకూ, తమ అమూల్య పరిశోధనా గ్రంథసంపుటి ద్వారా ఉపయోగపడేందుకు వీలుగా పెంపొందింప బడ్డాయి.

పారిశ్రామిక సంస్థలు, వ్యాపారసంస్థలు, పరిశోధనా సంస్థలు శాస్త్రీయ సాంకేతిక గ్రంథాలతో గూడిన ప్రత్యేక గ్రంథాలయాలను నిర్వహిస్తున్నాయి.

సంయుక్త రాష్ట్రాలలో గ్రంథాలయాలమీద అధికారం వికేంద్రీకృతమైనది. చాలా రకాల గ్రంథాలయాలు స్వతంత్రంగానే పెంపొందాయి. ఆ యా, రాష్ట్రాల గ్రంథాలయ చట్టాలు వేర్వేరుగా వుంటాయి. ఒకే రాష్ట్రంలో గూడా గ్రంథాలయాల మీద అధికారం పలువిధాలుగా వుంటుంది. దాదాపు సగం రాష్ట్రాలలో పాఠశాలా గ్రంథాలయోద్యోగులు శిక్షణ పొందినవారై వుండాలి. పాతికపాలు రాష్ట్రాలలో ఈ నిబంధన ప్రభుత్వ గ్రంథాలయోద్యోగులకు మాత్రమే వర్తిస్తుంది. సాధారణంగా స్థానికాభిరుచులను బట్టీ, చొరవనుబట్టీ గ్రంథాలయాలు పెంపొందుతున్నాయి.

కొంతకాలం గ్రంథాలయాలకు ప్రభుత్వం నామమాత్రంగా ధన సహాయం చేసేది. కాని ఇటీవల పాఠశాలా ప్రభుత్వ గ్రంథాలయాల అభివృద్ధికి కొన్నిరాష్ట్రాలు పెద్దమొత్తాలు ఖర్చుపెట్టాయి. ఈ దేశంలో గ్రంథాలయాభివృద్ధికి తగినంతగా ఉన్నప్పటికీ, అది అంతటా ఒకే తీరుగా లేదు. కనుక స్థానిక రాష్ట్రకేంద్ర నాయకులు ఈ గ్రంథాలయాల లోని వ్యత్యాసాలను చక్కబెట్టటం కోసం కృషిచేస్తున్నారు.

,